# హరిచర్య



గ్రంథకర్త
శిరోమణి చలమచర్ల రంగాచార్యులు

Approved by the Madras University as a Text Book for Vidwan 7th. Final, and by Benares Hindu University as a Text Book for Intermediate Exam.

# హాలికుఁడు



పశువులు స్వేచ్ఛగా బ్రతుకంగా నేపైన
పైరుపచ్చలఁ బెంచెఁ బ్రాజ్ఞుఁ డతఁడు
దిక్కులేకయుఁ గాలిఁ దిరుగు పక్షులకునై
సస్యమంజరు లిచ్చె సరముఁ డతఁడు

[illegible]

శిరోమణి

చలమచర్ల రంగాచార్యులు

# పాత్రములు

పురుషులు :—

| | |
|---|---|
| పోతన | కథానాయకుడు |
| శ్రీనాథుడు | కథానాయకుని బావమరది |
| సింగభూపాలుడు | రాచకొండప్రభువు |
| ఆస్థానకవి | |
| విదూషకుడు | |
| మంత్రి | |
| పేరావధాని | పురోహితుడు – పోతనద్వేషి. |
| పుల్లన్న | పేరావధాని బావమరది |
| గంగన, సింగన, నారయ | పోతనశిష్యులు |
| మల్లన్న | పోతనకుమారుడు |
| చిదానందయోగి | పోతనకు మంత్రముపదేశించిన యోగి. |
| సుబ్బయ్య, వెంకటరెడ్డి | బమ్మెరవాసులు, పోతనశిష్యులు |

సేవకుడు, పౌరులు, గ్రామాధికారి, కరణము మున్నగువారు

స్త్రీలు :—

| | |
|---|---|
| శారద | పోతనభార్య |
| భోగిని | సింగభూపాలునిఉంపుడుకత్తె |





ప్రథమముద్రణము ౧౯౪౦ ౫౦౦కాపీలు
ద్వితీయముద్రణము ౧౯౪౬ ౧౦౦౦కాపీలు

వెల ౧—౮—౦

# సహృదయుల దృష్టిలో 'హాలికుఁడు'

## పత్రికలు

★ **ప్రజామిత్ర**

...పోతన మహోద్దేశములు ఆదర్శప్రాయాలు. అటువంటి కవి జీవితాన్ని కథావస్తువుగ తీసుకొని పాత్రోచితభాషావిశేషాలతో హృదయరంజకముగా ఈ కృతిని రచించిన కవిగారు అభినందనీయులు ... ... ఈ రసవద్రచనను విశ్వవిద్యాలయ విద్యార్థుల కరకమలాలకు అందిచ్చి తదధికారులు కవికృషిని సార్థకపర్చదగుదు రని విశ్వసించుచున్నాము.

★ **గోలకొండ**

... ఆంధ్రమహాకవీంద్రుల జీవితచరిత్రము దృశ్యకావ్యముగ వెలువడుట కిదియే తొలిసారి యనవచ్చును. సంభాషణలు రసవంతములు. పద్యశైలి మృదుమధురము. రసికలోకము దృష్టియందీనాటకము నిర్దుష్టమై, ప్రయోక్తల కానుకూల్యసంధాయకమై, ప్రేక్షకుల కాహ్లాదదాయకమై యున్న దనుట కెట్టి సందియమును లేదు. ప్రతివారును చదివి యానందింప దగినది.

★ **విభూతి**

... కవిజీవితమును వస్తువుగా స్వీకరించి వ్రాసిన నాటకములలో ఇదియే మొట్టమొదటిది. ... 'హాలికుఁడు' అను పేరులోనే నాటక ప్రధానలక్ష్యము ధ్వనించుచున్నది... కవిగారి విద్వత్కవిత ప్రశంసనీయముగా నున్నది.

★ **దివ్యవాణి**

... ఈ నాటకములో ఒకకవి జీవితమును ఉపనిబద్ధించి కవిగారు గనఁబఱచిన నూతనపద్ధతికి మే మెంతయు నానందించుచున్నాము. ... ఆంధ్రవాఙ్మయములో నిట్టి యుత్తమరచనను చేర్చిన కవిని మే మభినందించుచున్నాము.

# సహృదయులు

★

మహారాజ 'సాహిత్యసమ్రాట్'
**శ్రీ విక్రమదేవ వర్మ, డి. లిట్. గారు,**
జయపుర సంస్థానాధీశ్వరులు. } మకాం : విశాఖపట్టణము
ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రోఛాన్సలర్ } ౪–౭–'౪౦,

......ఈపొత్తమును సాంతముగాఁ జదివి ముద మొందితిని. ఇది సమంజసముగా రచింపఁబడినది. దీనిశైలి ప్రాంజలమును, మధురమును గనుక నిది యాంధ్రజనసమాదరము గాంచు నని నావిశ్వాసము.

---

**డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు, ఎం.ఎ., పి.హెచ్.డి.**
రాయలసీమ కళాశాల, అనంతపురము. ౧౬–౬–'౪౦

......తదేకదీక్షతో మీనాటకమును సంపూర్ణముగాఁ జదివినాను. ......పోతనశ్రీనాథుల శీలములను దుదివరకును జక్కగాఁ బోషించి నారు. ......నాకుఁ గావలసినది కళ; రసస్ఫోరక మైన కళ. ఆకళా సూచనలు మీనాటకములో మెండుకొని యున్నవి. ......చక్కని కల్పన, ఊహా, రసము, భావము మీసొమ్ములు.

---

**కురుగంటి సీతారామయ్యగారు, ఎం. ఏ.,**
నిజాం కళాశాల, (హైదరాబాద్)

...... రసవద్ఘట్టములను గల్పించి, పాత్రలను సమంజసముగాఁ బోషించి పాత్రోచితభాషతో ఈ నాటకమును ఇంత రసవంతముగ నిర్వహించిన తమకు ధన్యవాదములు.

---

**కవిభూషణ, ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు,**
ఆంధ్రశాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము.

......'పాలికుఁడు' అను నీనాటకమును బఠించి ఆనందించితిని. ... ఆంధ్రుల సంప్రదాయసభ్యతలను, ఆచారాభిరుచులను సమర్థనీయము గా సంధించినందులకుఁ గవి శ్లాఘనీయుఁడు. ఒకమహాకవిజీవితపర మార్థములను ఆంధ్రవాఙ్మయమందుఁ బ్రదర్శించిన ఈకవికి నాయభి నందనములు. విశ్వవిద్యాలయవిద్యార్థుల కీనాటకమును బఠించు భాగ్య ము గలుగుగాత మని యాశించుచున్నాను.

---

'కవిసమ్రాట్టు' శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, ఎం. ఏ.,
ఉయ్యూరురాజావారి కళాశాల, బెజవాడ.

......రచన యింపుగ నున్నది...... ఈరూపకముచదివినవారికిఁ బోతన్నగారిని గురించిన సర్వకథానకములు కరతలామలక మగును. విశ్వవిద్యాలయమువారు దీనిని బాఠ్యగ్రంథముగా మన్నించినచో విద్యార్థుల కుపకారక మగును.

---

విద్వాన్ దర్భా వెంకటకృష్ణమూర్తిగారు. ఎం. ఏ.,
మదనపల్లి కళాశాల.

......ఈ నాటకమును సాంతముగఁ జదివితిని. మిక్కిలి బాగుగ నున్నది...

కవులచరిత్ర రూపకముగా విరచించుట కేనెఱింగినం
తవఱకు నీయదే మొదలు, తద్దయు మోదముఁ గూర్చె నాంధ్రస
త్కవులచరిత్ర లెల్ల నిటు తద్జ్ఞులు మెచ్చఁగ నాటకాలుగా
భువి వెలయన్ రచించి యిహమున్ బరమున్ గను! రంగసత్కవీ!

---

**'విద్యావాచస్పతి' శిరోమణి. హెచ్. గుండేరావుగారు,**

**గద్వాల సంస్థాన న్యాయాధిపతి.**

...... నాటకసంవిధానము పరమరమణీయముగ నున్నది. రసపూర్ణమైన మధురరచనతో ప్రధానమైన శాంతరసపరిపోషము మిక్కిలి చక్కగ కుదిరినది...ఈ నాటకము నెన్నిసారులు చదివినను తృప్తి తీఱుట లేదు...

---

శ్రీ శేషాద్రిరమణకవులు, శతావధానులు,

శ్రీమాన్ దూపాటి వెంకటరమణాచార్యులు గారు,

కరీమునగరము, ౮-౧౨-'౪౨.

...... మొదలుపెట్టి కడముట్టించువఱకుఁ దోఁచని తెఱంగున నీ నాటకమున్నది. కుడియెడముగ పోతన శ్రీనాథులకు వ్రాసిన పద్యములు ఆయా కవుల సొంతపద్యముల వలె నున్నవి. నాటకము మంచి పాకమునఁ బడినది. ... చదివి ఆనందించితిని.





## అంజలి

స్వాతంత్ర్యజీవను లయి సత్సంకల్పసిద్ధికై సర్వస్వ మర్పించు సాహసము గల సరసకవుల చరణసరసీజములకు భక్తితో ఈ కృతి నర్పించుచున్నాఁడ.

## మనవి

అఖిలప్రపంచ విఖ్యాతిని బడసిన మహావ్యక్తులలో బమ్మెర పోతనామాత్యుఁ డొకఁడు. ఆతని మహోద్దేశము లాదర్శప్రాయములు. అనుకరణీయ మగునట్టి యాతని జీవితమే నన్నాకర్షించి ఈ నాటకమును వ్రాయించినది. ఆంధ్రదేశమున ఆబాలగోపాలము అనూచానముగ ఆయుత్తమశ్లోకునిఁగూర్చి చెప్పికొని యానందించు ఆ యా యద్భుతకథలు, ఘట్టములే యొకింత మార్పుతో ఈ రూపకరూపమును పొందినవి. అవసర మనిపించిన పట్టుల నా యా కవీశ్వరుల పద్యములు కూడ వాడఁబడినవి. వానిని కొటేషన్ " " గుర్తులతో గమనింప నగును. ఔచిత్యమునకై ఆ యా కవుల శైలియే సాధ్యమైనంతవఱకు అనుకరింపఁబడినది. విద్యాసంస్కార యోగ్యతలను దృష్టియం దిడికొని ఆ యా పాత్రల కనుగుణ మగు భాష యుపయోగింపఁబడినది. ఈనాటకనిర్వహణము నందలి బాగోగుల నిర్ణయమును రసికులగు పాఠకులకే వదలెదను.

## కృతజ్ఞత

సారస్వతాభిమానము వెల్లివిరియ ఈ నాటకమును వెలువడఁజేసిన శ్రీయుత చెన్న కేశవుల హనుమంతరావునాయుఁడు Retired Chief P. W. Inspector (N. S. R.) గారికిని, ఈరూపక రచనావ్యవసాయమునఁ జేదోడైన నా సుహృన్మండలమునకును కృతజ్ఞుఁడను.

# కృతి ప్రకాశకులు

ఈ కృతిని ప్రకాశింపఁజేసినవారు శ్రీ చెన్నకేశవుల హనుమంతరావు నాయుఁడు (Retired Chief P. W. Inspector N. S. R.) గారు. వీరి స్వగ్రామము కృష్ణామండలములోని బందరు. తండ్రి భద్రాచలము నాయుఁడుగారు పోలీసు సర్కిల్ ఇన్స్పెక్టరుగా పనిచేసియు ప్రజల డెందములను జూఱఁగొనిన యుత్తములు. మహోదాత యని పేరెన్నికగన్న ధన్యుఁడు. వీరి దాతృత్వమున కలరి ప్రజలు వీరిని బంగారు నాయుఁడుగారనియే వ్యవహరించుచుండిరఁట. తల్లి రత్తమ్మగారు సతీమతల్లి; గొప్పభక్తురాలు. శ్రీ హనుమంతరావు నాయుఁడుగారికి బాల్యమునందే ఆంధ్రవాఙ్మయముపై నత్యంతమగు ప్రేమ గలిగినది. దానికి సుప్రసిద్ధులగు శతావధానులు శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికడ ఉన్నతపాఠశాలలో తెలుఁగు చదువుటయే ప్రధానకారణము. నాయుఁడుగారు స్వయముగఁ జక్కని కవితఁ జెప్పఁగలవారు. ఉద్యోగమునందుండియు వీరు తీరిక గల్గినపుడెల్ల ఉత్తమశ్రేణికిఁ జెందిన యాంధ్రప్రబంధములను శ్రద్ధమై పఠించుచుందురు. 'హాలికుఁడు' అను నీనాటకమును హైదరాబాద్ నగరమున ౧౯౫౮లో శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయపక్షమున జరిగిన 'పోతన సప్తాహము'లోఁ బ్రదర్శించుటకు మిత్రులు కోరఁగా వ్రాసితిని. ఇది రెడ్డి విద్యార్థి వసతిగృహములో (హైదరాబాద్ నగరమున) ప్రదర్శింపఁబడినపుడు చూచి శ్రీ నా యుఁ డు గా రు అంతవఱకు వారితోఁ బరిచయము ఎక్కువగా లేని నన్ను పిలిపించుకొని నాటక మంతయుఁ దిరిగి విని స్వయంప్రేరితులై ఈనాటకమును ముద్రింపించుటయేగాక ఈద్వితీయ ముద్రణమునకుఁ జేదోడై తమసారస్వతాభిమానమును వెల్లడించిరి.

## శ్రీ చెన్నకేశవుల హనుమంతరావు నాయుడు గారికి
## సువర్ణాక్షతలు

కవితావాహిని నోలలాడు, రసవత్కావ్యామృతాస్వాదవై
భవముగ్ధుండగు, సద్విమర్శరచనాపారీణుఁడైమించు, సం
స్తవనీయోత్తమ జీవితంబు నెరపున్, ధన్యాత్ముఁడీ చెన్నకే
శవవంశాబ్ధిసుధామరీచిబహుభాషాకోవిదుండై భువిన్.

పూతచరిత్రుఁడైన కవిపోతన జీవితదివ్యగాథ వా
క్ప్రాతురియొప్ప వాలికుఁడు కమ్మఁగ వీనుల విందుసేయఁగా
నాతతమోదజాతపులకాంకితుఁడై హనుమంతరావు వి
ఖ్యాతిగ ముద్రిణవ్యయము కానుకవెట్టె జనంబుమెచ్చఁగన్.

పలుకువెలంది కర్ణయుగపర్వములై తనరారు కాకలీ
కలనినదంబులన్ రుచిరగానకళావిభవంబుఁ జూప, శ్రీ
లలన కటాక్షవీక్షణవిలాసవిభాసితలాస్యచాతురిం
జెలువుఁ దలిర్ప మోదమును జెందెడు మా హనుమంతరాయడున్

ఎమ్మెయి భాగవతంబును
బమ్మెర పోతన్న కవియు వాఙ్మయసౌధం
బిమ్ముగ నుండెడు నవ్విధి
నిమ్మహితాత్ముండు నుండు నీకృతికతనన్.

తెలుఁగుతల్లి చలువతేఁట చూపులదండ
గ్రాలుగాక! యితని కంఠసీమ
తనరుగాక! సిరులు తామరతంపరై
మాధవుండు సతము మనుచు గాక!

గ్రంథకర్త

ఓమ్

# మున్నుడి

శ్రీకావ్యకన్యక 'నిమ్మనుజేశ్వరాధముల కిచ్చి యప్పడుపుగూడు భుజించుటకన్న సత్కవుల్ హాలికులైన నేమి!' యని తన జీవితనౌకను ప్రతికూలవాతమున నేటి కెదురుగ నడపి, గమ్యస్థానమును జేర గల్గిన సహజపాండితీమండితుఁడు, శ్రీరామభద్రభక్తాగ్రేసరుఁడు నగు పోతనమహాకవిచరిత్రను ఈనాఁడు, ఈసరసకావ్యకళాధురంధరుఁడును, మన్మిత్రుఁడు నగు 'శిరోమణి' చలమచర్ల రంగాచార్యులు "కావ్యేషు నాటకం రమ్యం" మని నాటకముగ రచించి యాంధ్రలోకమున కర్పించెను. నాటకము ప్రదర్శింపఁబడినపుడు స్వయముగఁ జూచియుఁ గవి యామూలాగ్రముగఁ జదివి వినిపింప వీనులలర వినియు నానందించితిని. పీఠిక వ్రాయుఁడని కోర మిత్రవాక్యము త్రోసివేయ రాని దగుటను, నాటకమును జూడను, జదువను గల్గిన యానందానుభవప్రోద్బలము వల్లను అందుల కియ్యకొంటిని.

కవుల జీవితచరితలే మనభారతభూమిని దుర్లభములు. అందునను మన యాంధ్రభాషలో మృగ్యములు. తమ్ముగూర్చి చెప్పికొనుట కిచ్చగింపని సద్భావముగలవా రగుట యందులకు హేతువు కానోపు. అందుచేత మనయాంధ్రమున నాంధ్రకవుల జీవితగాథను దృశ్యకావ్య రూపమున వ్రాయుట కిదియే మొదటి యత్నమైనందుల కీగ్రంథ కర్త కృషి నాంధ్రలోకము గుర్తింపక పోవదని తలంచెదను.

లోకము చూపోపమి యను సహానముల చే సజ్జనుల కొనరించు దుష్కృతముల ఫలములు, ఆ లోకముయొక్క హృదయపరివర్తన

పశ్చాత్తాపము లేయనిఘంటాపథముగ నీనాటకమునఁ గర్తనిర్వహించి యొసంగిన మహోత్తమసందేశము. ఈ నాటకము సహృదయ హృదయరంజకముగ, పాత్రోచితభాషావిశేషములతో, సరసశైలీ విలాససౌభాగ్యములతో సంపన్నమయి, తన ప్రయోజనమును వివిధ పాత్రలముఖమున వెల్లడించుచున్న దనుట యతిశయోక్తి కాదు.

నాటకారంభము సింగభూపాలుని సంగీతకవితాగోష్ఠులలో ఆనాటి యాంధ్రసంస్కృతిసంప్రదాయములను గన్నులకు గట్టినట్లు ప్రదర్శించుచు, కథానాయకుఁడగు పోతనమహాకవి జీవితలక్ష్యమునకు బీజావాపము సేయుచున్నది. పదపడిన కథాసంవిధానము, మహోన్నతమైన పోతనరసహృదయకుహరమునుండి నిసర్గధారావేగముతో రాజాస్థాన ప్రదేశములలో బ్రవహించుచునచ్చినమహనీయమధురకవితాస్రవంతి, భోగినీదండక మను సేతువుచే సడ్డగింపఁబడి, మహాభాగవతమార్గమునఁ బ్రవహించి, ఆంధ్రప్రజాహృదయసారక్షేత్రముల వెల్లివిరిసినట్లు నిరూపించుచున్నది. పోతన ప్రపూతసంకల్పము, శ్రీనాథుని నరాంకితప్రోత్సాహ మొకవంకను, సింగభూపాలుఁడును పేరావధానులును గల్పించిన యాపత్పరంపర లొకవంకను, చెదరఁదీయఁజూచినను చెదరక, శ్రీరామానుగ్రహము, చిదానందయోగి యుపదేశము తోడుగా, సానబెట్టఁబడిన వజ్రమువలెఁ బ్రకాశించి, ప్రత్యర్థుల హృదయతమఃపుంజమును బారదోలుటతోఁబాటు యావదాంధ్ర హృదయసీమలలో విజ్ఞానచంద్రికల వెదఁజల్లినట్లు లాయాఘట్టములు రమణీయముగ, రసోచితముగఁ గూర్పఁబడినవి. నరనారాయణావలంబకులయి, పరస్పరవిరుద్ధము లగు శృంగారశాంతరసముల కాలవాలభూతులగు, శ్రీనాథపోతనల భిన్నప్రకృతులను నతిమనోహరముగ సమన్వయించి, యీ నాటకాదర్శమునఁ బ్రతిఫలింపఁజేసి ప్రేక్షక

లోకమున కందించిన కవి ధన్యుఁడు. ప్రత్యర్థికోటికిఁ జెందిన సింగభూపాలుని వీరావధానుల హృదయమునరిన రైన ఘట్టములోఁ బాత్రపరిణామ చమత్కారము చక్కఁగఁ బోషింపఁబడి కథాంశమునకు వన్నెలు దిద్దుచున్నది.

నాటకరచనాసందర్భమునఁ గవి చూపిన శిల్పము లనల్పములు. భాషయం దౌచిత్యముతోఁబాటు, తెనుఁగునుడికారపుసొంపు పెంపెస లారుచున్నది. ఈ నాటకము దృశ్యకావ్యలక్షణముల కనన్యాతిరిక్తముగ లక్ష్యమయి, యభిరూపపరిష దాహ్లాదకరముగ నున్నట్లు లోఁతునకు దిగి పరిశీలించినకొలఁదిని నాకుఁ దట్టినది. ఇందు "వికారహేతావపి విక్రియంతే యేషాం నచేతాంసి త ఏవధీరాః" అను కవికులచక్రవర్తి యగు కాళిదాసుని శ్రీసూక్తి కనురూపకముగఁ దన జీవితమును దిద్దుకొనుచు, నేఁటికి దాదా పారువందల యేండ్లక్రిందట, భూపాలురు కీర్తిలోభమునఁ గలిమిచేఁ బలిమిచే, గవులను వందిమాగధులుగఁ జేసికొని వారి కృతికన్యకలను గుత్త కొనినట్లు స్వవశము చేసికొనుచుండిన యాకాలమునఁ, గవిపుంగవులును గాంచనలోభమున దమ దివ్యకవితామృతమును వీధి కెక్కించి యెగఁజిమ్మి నమ్మిచేయుచుండిన యాకాలమునఁ, దాను దరిలేని దారిద్ర్యాంబుధిలోఁ దొప్పఁదోఁగుచుండియు రత్నహారములతో, నగ్రహారములతో దరియవచ్చు రారాజులఁ ద్రోసిరాజని కవిసార్వభౌముని యుపదేశములను గూడఁ గాదని యనేక కష్టపరంపరలకుఁ జిక్కియు, "బాలరసాలసాల నవపల్లవకోమల" మగు తన కవితను ధీరుఁడయి నరాంకితము సేయక, స్వాతంత్ర్యమునకయి తన జీవితసర్వస్వమును ధారవోసి కృతకృత్యుఁడయి యెల్లరకు నాదర్శప్రాయుఁ డనిపించుకొన్న పోతన 'కవి'వలెనే గాక, 'మహావీరుని'వలెఁ గూడ, మనకు అన్ని జీవితసంఘటనల యందును మార్గదర్శకుఁడుగా నిరూపింపఁబడినాఁడు.

పోతనమహాకవిపవిత్రజీవితమును దత్సందేశమును జక్కఁగాఁ జిత్రించు నీ 'హాలికుఁడు' అను నాటకరాజ మాంధ్రవాణిమేఖలా ఘంటికగా సంతరించిన యీ కవి ఆంధ్రలోకము గౌరవాదరములకుఁ బాత్రుఁడగుగాక యని యాశించుచు, నీ యుత్తమరూపకమునకు బహుప్రచారచిరస్థాయిత్వముల నభిలషించుచు నా యీ చిన్ని మున్నుడిని ముగించెదను.

ఇట్లు,

సుకవిజనవిధేయుఁడు,

'విద్వాన్' సరిపెల్ల విశ్వనాథశాస్త్రి, ఎం. ఏ.,

నిజాం కళాశాల ఆంధ్రశాఖాధ్యక్షుఁడు.



శ్రీ

# హోళికుఁడు




శ్రీమహిళామతల్లి విలసిల్ల మెఱుంగు తెఱంగు, సజ్జన
స్తోమము సారనాళినతెఁ దోఁపఁగ దాపున, మౌనిబృందమున్
ప్రేమ మయూరపాళిక్రియ నృత్యము సల్ప, వృషాద్రిసానుభూ
సీమ వెలుంగ నిల్చి సుధఁ జిల్కు నవాంబుదమున్ భజించెదన్.

రాజసభావముం దొఱఁగి, రమ్యగుణప్రకరప్రసూనముల్
పూజలు సేసి, మంజుకృతిపుంజము నంజలు లొగ్గి, భక్తినీ
రాజనరాజిరోచుల విరాజిలు భక్తులఁ బ్రోచు కల్పభూ
మీజము దివ్యతేజ మది మీ కొనఁగూర్చుత! సర్వసంపదల్.

సూత్రధారుఁడు— (ప్రవేశించి పుష్పాంజలిఁ జల్లును.)

నటి— (మఱియొకవైపునుండి ప్రవేశించి నవ్వుచు) ఆర్యపుత్రుల యాధ్వర్యము అభిరూపపరిషదారాధనముతో నారంభ మగుచున్నది కాఁబోలు!

సూత్ర— కాదు, వీణాస్వానమును న్యూనము సేయు నలివేణీ గానముతో!

నటి— మీవి పాము చెవులుసుమా! చెలువుదనరు శిశిరఋతువునకుఁ జిత్తమలరి యేదియో చిన్నిపాట పాడుకొనుచుంటిని. ఇంతకే యంత యెగతాళియా!

సూత్ర—జాళువా తాళికి అలరుటయు, ఎగ తాళికి అలుగుటయును, అతివలకే చెల్లును !

నటి— ఔను ! తమరు సూత్రధారులు గావున నీ సూత్రము గ్రహింపఁగల్గితిరి. దానికేమిగాని. నేఁ డీపరిషత్తు పర్వదినపయోధివలె నతివేలమై యుండుట నానందసాధ్వసములు గలుగుచున్నవి.

సూత్ర— సత్యము. రాజాస్థానములవలె నాటకరంగములును జిరకాలానుభవము గలవానికిఁ గూడ ప్రతిక్షణము నూతనములై చూపట్టును. సదస్సు సహస్రాక్షమై పరీక్షించుచుండఁ బురాణనాటకములఁ బ్రదర్శించుటకే పుయిలోటము. అర్వాచీననాటకముల మాట వేఱ యడుగవలెనా ?

నటి—(నవ్వుచు)నాటకరంగమును నట్టిల్లుగాఁ జేసికొన్న తమరును దటపటాయించుచుంటిరే !

సూత్ర— కాదు మఱి! రూపకము నూతనము. అనురూపాభినయముతో నభిరూపపరిషత్తు నానందింపఁజేయుట యనఁగ త్రివిక్రమసాము గాదా !

నటి— రంగము చిత్రయవనికామంగళము; నటులు నాట్యకళాపటులు; ఇతివృత్తము తెలుగుకవి సువృత్తము; ఇఁక ప్రయోగము సుప్రయోగము కాకుండు టెట్లు ?

సూత్ర—ఆమాట మనకెందులకు! కవివలె మనమును బ్రయోగనిర్వాహణమున బాగోగుల నిర్ణయమును సరసమగు ప్రేక్షకసమాజమునకే వదలివేయుదము. అదియే సరసము.

నటి— ఔనౌను! మీరు సరసములేగాఁ జేయునది! సరియేఁ కాని క్రొత్తనాటకమునకుఁ గ్రొత్తపేరే కుదిరినదండి! 'హాలికుఁడు'...!

సూత్ర— హాలికుఁడని యాశ్చర్యపడుచుంటి వేల! ఆంధ్రకవిని హాలికుఁడ'ని రనియా ! సారస్వతక్షేత్రమున సంకర్షణుఁడై సరస

భాగవత కావ్యఫలమును బండించి సకలజనోపయోగమునకై సద్వినియోగము చేసిన యాంధ్రకవి పోతన 'హాలికుఁ' డనఁబడుట కర్హుఁడు. కలమును బట్టినట్లు హాలమును బట్టెనుగదా! సకలవిద్యాసనాథుఁడగు శ్రీనాథుని సంబోధనము సైతము 'హాలికుఁ'డనియే! కవిసార్వభౌముని పదమూ కవులు బట్టుటలోఁ గ్రొత్త యేమి ?

నటి— 'హాలిక'పద మన్వర్థమై సహజకవికి సహజముగ నున్నది.

(ప్రేక్షకులలోఁ గరతాళములు.)

సూత్ర— (కరతాళములు విని) అదిగో! కరతాళములతోఁ బ్రేక్షకులు కర్తవ్య ముపదేశించుచున్నారు వేళయైనది. త్వరపడుము. నీ నేర్పుకొలది భోగినిఁగాఁ జేసి సిద్ధపఱపుము. సింగభూపాలు నాస్థాన శృంగారములను నేఁజూచెదను.

నటి— నాకు మంచిపనినే నియోగించితిరిలెండు! (నవ్వును.)

సూత్ర— (నవ్వుచు) ఎవరిసామర్థ్యమునకుఁ దగిన కార్యములు వారికి లభించుచుండును లెమ్ము! రమ్ము!

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

తెఱవాలును.



# హాలికుఁడు

## ప్రథమాంకము

రంగము:— రాచకొండదుర్గములోని రాజాస్థానము.

(ప్రభువు సర్వజ్ఞసింగభూపాలుఁడు సింహాసనాసీనుఁడై యుండును. భోగిని బంగారుచామరము గేలమెఱయుచు రాజుప్రక్కన నిలచియుండును. మంత్రి, ఆస్థానవిద్వాంసుఁడు, విదూషకుఁడు మున్నగువారు యథాస్థానములఁ గూర్చుండియుందురు. ఇరుగడల నిలచి వందిమాగధులు కైవారము సేయుచుందురు.)

౧-భట్టు —జయ ! వైరిగణతూలజంఝూసమీర !

౨-భట్టు — పరాకు !

౧- ,, — జయ ! భూరివైభవశక్రావతార!

౨- ,, — పరాకు !

౧- ,, — జయ ! భోగినీచిత్తసారసభృంగ !

౨- ,, — పరాకు !

౧- ,, — జయ! శీతలాపాంగ! సర్వజ్ఞసింగ !

౨- ,, —పరాకు !

౧-౨— (ఏకస్వరమున) సర్వరక్షకుఁడు మాధవుఁడు నీ సత్కృతి సంతుష్టుఁడై శరచ్చంద్రచంద్రికావిసారంబుఁబోని కరుణాతరంగితాపాంగప్రసారమును శ్వేతచ్ఛత్రముఁ జేయ శుభముల నీయ, ధర్మాసన మగు సింహాసన మలంకరింపుమో సాధురక్షా! దుష్టశిక్షా! త్రిలింగాధ్యక్షా! బహుపరాకు!

(సభ్యులు జయజయధ్వనులు చేయుదురు.)

సింగభూపాలుఁడు —(మంత్రిని జూచి) రాజకీయములతోఁ దలకు విసువెత్తినపుడు నిజముగా సంగీతసాహిత్యములు రసాయనములు. (చామరము వీచు భోగినిఁ జూచి నవ్వుచు) ఔనా ?

భోగిని— (క్రీఁగంటితోఁ జూచుచు) ఔనేమో! ఎవరికిఁ దెలియును మీగూఢభావము? చాలు లెండు. నేర్చుకొని పోయినారు. సంగీత సాహిత్యములు...... ఊఁ! (తల యూఁచును.)

మంత్రి— చిత్రము, చిత్రము. సంగీతమునను, సాహిత్యమునను గ్రంథరచనాధురంధరు లగు భూపురందరుల వాక్కులు వేదవాక్కులు.

ఆస్థానకవి— ఆ! ఆ! ప్రభువుగారి పలుకులు అక్షరలక్షలు... కాదు మఱి? "అనుభవరసికో విజానాతి." ప్రభూత్తంసుని సంగీత సాహిత్యాభిమానము జగత్ప్రసిద్ధము; కళాలతలకుఁ గల్పరసాలము.

(సభ వంకఁ జూచును.)

విదూషకుఁడు— కావుననే కవికోకిలమున కాశ్రయ మిచ్చిన దీరాజరసాలము. గొంతు వగరెక్కినదనుక అనుభవింపవచ్చును!

(ఆస్థానకవినిఁ జూచి తేనిఁ జూచును.)

సింగ— (చిఱునగవుతోఁ దలయూఁపును. సభ్యులు నవ్వుదురు)

మంత్రి— ప్రభువరేణ్యుని ధీశక్తి విచిత్రమైనది. దాని కిఱుగడలను పదును గలదు. (రాజునుఁ జూచును.)

ఆస్థానకవి— మంత్రులు సుమంత్రులు; మహీపాలుఁడు రామభూపాలుఁడు. నిస్సంశయము. ఆ విరించి ఏర్చి కూర్చినాఁడు. ఆహా! (రాజును, మంత్రినిఁ జూచి సభవంక దర్పముతోఁ జూచును.)

విదూషకుఁడు— అహాహాహా! ఇఁక మిగిలిన తమరు వసిష్ఠులో, వాల్మీకులో యని సూచ్యార్థము కాఁబోలు! మఱి - నామాట?

సింగ— నీవు అక్కడకూడ ఇదియే స్థానము.

అంగఱు— ప్రభువులు మిక్కిలి ఉచితజ్ఞులు. మిక్కిలి ఉచితజ్ఞులు.

విదూ— చిత్తము. కాశికిఁ బోయినను గావడిమోఁత తప్పదు కాఁబోలు నాకు? తలవ్రాఁత! ఏమి చేయుదును?

(అందఱు నవ్వుదురు)

మంత్రి— (తనలో) సంగీతసాహిత్యగోష్ఠులను జరిపింపు మని కాఁబోలు రాజుగారి ప్రస్తావన శాసించుచున్నది. అబ్బ! మహీపాలుర

హృదయములు అగాధములు. కనుగలిగి మెలఁగవలయును. ఇఁక ఆలసింపరాదు. (గాయకునిఁ జూచి ప్రకాశముగా) గాయకుఁడు తన యనుచరులతోఁ ప్రభూత్తంసుని మ్రోల గానసభ చేసి తన విద్యకు గౌరవము గల్గించుకొనుగాక.

గాయకుఁడు—— ప్రభువులయాజ్ఞ మహాప్రసాదము. (తన యనుచరులతోఁగూడి సంగీతము పాడును. అందఱుహర్షనాదము సేయుదురు.)

సింగ—— (చామరము వీచు భోగినిఁ జూచుచు) గానము హృదయాకర్షకముగ నున్నది. (మెల్లఁగ) నీవలె. (కన్నుగీటును; భోగిని నవ్వును.)

మంత్రి—— సంగీతకళాకోవిదులగు ప్రభువరేణ్యుల మెప్పువడసి గాయకుఁడు ధన్యుఁడైనాఁడు.

ఆస్థానకవి—— కిన్నరగీతముఖరితమగు సుధర్మను దలపించుచున్న దీనాఁటి ప్రభూత్తంసుని కళామందిరము. ఆహా!

(కనుబొమ లెగురవేయును.)

మంత్రి—— గాయకా! ఒకతూఁటి-ఏదీ? ఆ మన ఆస్థానమహాకవీశ్వరులు తాళబద్ధముగ రచించిన తేనె వసంతోత్సవవిలాసగీతమును ఆ నటీలాస్యమున మేళవించి వీనుల విందొనర్పుము.

((ప్రభువును జూచును.)

భోగిని—— (మెల్లఁగ) మంత్రీశ్వరులు మిక్కిలి సమయజ్ఞులు. రసికశేఖరులగు మనోహరుల వైభవము తనివిదీర విన నవకాశము గల్పించినారు. (నవ్వును.)

సింగ—— (మెల్లఁగ)అది నీ యపాంగముల శాసనఫలితము కాదు గద! (ఇద్దఱు నవ్వుదురు.)

గాయకుఁడు—— వసంతోత్సవవిలాసగీతమా? చిత్తము.

కల్యాణి——రూపకము.

మధుర మధురమీ...మధుమాసోత్సవంబు హృదయమునకు

అనుపల్లవి.

అధరీకృతవిబుధేశ్వర । పరిధితాధికవైభవంబు ॥మధుర॥

చరణములు.

౧. చూతకిసలయాతిశాత । సుందరతరతంత్రి మీటి
ఆతతముగ పికగాయకు । లాలాపింపంగ నెంతొ ॥మధుర॥

౨. ఫుల్లకుసుమస్మేరరుచుల । మల్లికాదివల్లరులను
పల్లవోష్ఠు లెల్ల లాస్య । ముల్ల ముల్లసిల్ల నాడ ॥మధుర॥

౩. కమలదళరజంబు జల్లి । కస్తురిమలయజంబు నలఁది
విపులసమీరకుమారుఁడు । వీవఁగ వీవనలఁబట్టి ॥మధుర॥

౪. అంగజారిపదసంగతి । మంగళాంతరంగుఁడైన
సింగరాడపాంగమాలిక।రంగురంగులహొయలుమెఱయ॥మధుర॥

సింగ—— ఈతని గాత్రమాధుర్యము విద్యుత్తు మెఱుఁగు వెట్టు చున్నది. ఈగాయకునకు వేయినూట పదార్లతో "అభినవతుంబుర" బిరుదము నిచ్చుచున్నాము. (భోగినితో మెల్లఁగ) ఏమందువు?

భోగిని—— (మెల్లఁగ) కళావంతుల యుల్లమునే కొల్లఁగొట్టు కళా భిజ్ఞులగువా రేమిచేసిన బాగుండదు ? (ఇద్దఱు నవ్వుదురు.)

మంత్రి—— (పళ్లెరములో వేయినూటపదార్లఁ దీసికొని) పరిభువ రేణ్యునిది రసహృదయము. గాయకా ! నీ విఁక "అభినవ తుంబుర" బిరుదముతో వ్యవహరింపఁబడుదువు. ఇవిగో వీనినిఁ దీసికొనుము.

(ఇచ్చును.)

గాయ—— ధన్యుఁడను. ధన్యుఁడను. ప్రభువుగారిమ్రోల గానసభ చేయుటకు ఆ కిన్నరులకే గుండెదడ. సామాన్యుఁడను నా సంగతి చెప్పవలెనా ! బిడ్డలము వారి దయ. (రూప్యముల స్వీకరించి వంగి నమస్కరించును.)

సింగ—— (భోగినిఁజూచి మెల్లఁగ) కిన్నరులమాట కేమిగాని యీ కిన్నరీజనము మాత్రము మా భోగినిముందు నిలువనైన నేరమి పేరు నిలువఁబెట్టుకొనినది. (నవ్వును.)

భోగిని—— (క్రీఁగంటఁ జూచుచు మెల్లఁగ) మీ శ్లేషసౌభాగ్యము మాకు నూతనము కాదు లెండు. (చిఱునవ్వుతో తలయూఁచును.)

సింగ——(విదూషకునిఁ జూచి నవ్వుచు) ఏమయ్యా! సంగీతము నచ్చినదా? అట్లు పెంకెపెండ్లికొడుకువలె పెడమొగము పెట్టితి వేమి?

విదూ——మహాప్రభూ! ఏమి చెప్పుదును? సంగీతము తాళ్లఁ గరఁగించు ననియు, ఎండిన మ్రాఁకులఁ జిగిర్పించుననియు విన్నప్పటినుండియు నేను సంగీతమునకు సాధ్యమైనంత దూరముననే తొలఁగి యుందును.

సింగ——(నవ్వి) ఏమది?

విదూ—— ఏమో! ఏకాల మెట్లుండునో! ఇదిగో! ఇది మా అత్తగారు అలుకలోఁ బెట్టిన యుపరంజియుంగరము. దీనిలోని పచ్చ పాములను చేరనీయదని, భద్రము పోగొట్టుకొనకు మని మా నాయనమ్మ చెవినిల్లు గట్టుకొని చెప్పుచుండెడిది. ఈ పాటలతో కొంపదీసి ఈ కొంచెము నీరుగారిపోయినచో నిఁక పాడుపాముల బాధ పడలేను. పాములనిన నాకు జనమేజయున కున్నంత కోపము. సర్పయాగము చేయలేదుకాని చిన్నతనములో వానపాములను కాలికొలఁది మట్టుచుండెడివాఁడను.

అందఱు—— (పకపక నవ్వుదురు.)

ఆస్థానకవి—— ఆ కఱ్ఱను అటు దాఁచుకొంటి వేల ?

విదూష—— బేలా ! ఏలయని కవులను ప్రశ్న వేయుము. ఈ కొంచెము తెలియనివాఁడవు కవి వెట్లగుదువు? నేను కూడ బాల్యమున కవినే. నా కవికతకుఁ గారణ మీకఱ్ఱ. ఎట్లందువా ! నస్యము వేసి కూరుచుండినపుడు కవిత ఊటబుగ్గవలె బుగబుగ పొర్లుకొని వచ్చెడిది. ఆ నస్యము ఈ కఱ్ఱతోఁ జేయఁబడినది కాఁబట్టి కవితకు కఱ్ఱ మూలము కాలేదా ! ఈగితికి ఈకఱ్ఱ చిగిర్చి పూఁత, పిందె, తొడుగ మొదలుపెట్టెనా నస్యమునకు నాస్తి కాదూ ?

(సభ్యులు విరగఁబడి నవ్వుదురు.)

సింగ ——హాస్యము అన్య రసోద్విగ్నులకు ప్రతిక్రియ.

ఆస్థానకవి— (లేచి) చిత్తము, చిత్తము. "పిండఖర్జూరోద్వేజితస్య తింత్రిణ్యా మివాభిలాషః" అనను మా బోటి ఒక ఆస్థానకవిః ప్రభువుగారు సర్వజ్ఞులు!

విదూషకుడు— ఆ! ఏమీ! నీబోటి ఆస్థానకవియా! ఆమాట అనినది, నాబోటి విదూషకుఁడా? ఎంతగర్వమన్నా!

మంత్రి— ఇఁక ఆస్థానకవి కవితాచమత్కృతులు ప్రభుసన్మానపాత్రము లగుగాక. (ఆస్థానకవినిఁ జూచును.)

ఆస్థానకవి—(తనలో) అబ్బ! సభలో పద్యముచెప్పి చాల కాలమైనది. ఆ దిగ్గంతులచాటున కాలము బుచ్చుచుంటిని. నేఁడు వారెవ్వరును రాలేదు. అయినను శ్రోత్రవారెరును లేరు. గుడ్డిలో మెల్ల! (ప్రకాశముగా) మహాప్రసాదము. కవిత కేమి! కావలయునంత! ఏమి సెలవు?

మంత్రి— ఓహో! నేఁడు తమరా! మంచిది. ప్రభువరేణ్యుని సమ్ముఖమున జరిగిన ఇప్పటి సంగీతసభను వర్ణింపుఁడు.

ఆస్థానకవి— ఆ! లెక్క ఏమి! దివ్యముగా!

అతులిత శేముషీకలితహావసమంచితదివ్యలాస్యసం
గతిఁ గమనీయమైన నృత్య గాయకగాన మనూన, మప్సర
స్తతి కవమాన, మీ సచివసత్తముఁ డాగురుఁ గేరు, మా మహీ
పతి విభవంపుసొంపు తలవంపు నిలింపుల కేని కెయ్యెడన్.

(ఆత్తుగా చదివి, గర్వముతో సభవంకఁ జూచును. సభలో హర్షము.)

విదూషకుడు— (మెల్లఁగా) నేనీ పద్యము నిదివఱకె చెప్పుటనో వినినట్లు జ్ఞాపకము.

ఆస్థానకవి— (మెల్లఁగా) నీయిల్లు బంగారముగాను పరువుదీయకుము.

మంత్రి— మిక్కిలి మనోజ్ఞముగా నున్నది. "తలవంపు నిలింపుల కేని" తథ్యము. ముమ్మాటికి. (రాజును జూచును.)

భోగిని—— (క్రీఁగంటఁ జూచుచు మెల్లఁగ) మీ శ్లేష సౌభాగ్యము మాకు నూతనము కాదు లెండు. (చిఱునవ్వుతో తలయూఁచును.)

సింగ——(విదూషకునిఁ జూచి నవ్వుచు) ఏమయ్యా! సంగీతము నచ్చినదా? అట్లు పెంకెపెండ్లికొడుకువలె పెడమొగము పెట్టితి వేమి?

విదూ——మహాప్రభూ! ఏమి చెప్పుదును? సంగీతము త్రాఁచుల రంగించు ననియు, ఎండిన మ్రాఁకులఁ జిగిర్పించుననియు వినినప్పటినుండియు నేను సంగీతమునకు సాధ్యమైనంత దూరముననే తొలఁగి యుందును.

సింగ——(నవ్వి) ఏమది?

విదూ——ఏమో! ఏకాల మెట్లుండునో! ఇదిగో! ఇది మాఅత్తగారు అలుకలోఁ బెట్టిన యపరంజియుంగరము. దీనిలోని పచ్చ పాములను చేరనీయదని, భద్రము పోగొట్టుకొనకు మని మా నాయనమ్మ చెవినిల్లు గట్టుకొని చెప్పుచుండెడిది. ఈ పాటలతో కొంపదీసి ఈ కొంచెము నీరుగారిపోయినచో నిఁక పాడుపాముల బాధ పడలేను. పాములనిన నాకు జనమేజయున కున్నంత కోపము. సర్పయాగము చేయలేదు కాని చిన్నతనములో వానపాములను కాలికొలఁది మట్టుచుండెడివాఁడను.

అందఱు—— (పకపక నవ్వుదురు.)

ఆస్థానకవి—— ఆ కఱ్ఱను అటు దాఁచుకొంటి వేల?

విదూష—— బేలా! ఏలయని కవులను ప్రశ్న వేయుము. ఈ కొంచెము తెలియనివాఁడవు కవి వెట్లగుదువు? నేను కూడ బాల్యమున కవినే. నా కవికతకుఁ గారణ మీకఱ్ఱ. ఎట్లందువా! నస్యము వేసి కూరుచుండినపుడు కవిత ఊటబుగ్గవలె బుగబుగ పొర్లుకొని వచ్చెడిది. ఆ నస్యము ఈ కఱ్ఱతోఁ జేయఁబడినది కాఁబట్టి కవితకు కఱ్ఱ మూలము కాలేదా! ఈగితికి ఈకఱ్ఱ చిగిర్చి పూఁత, పిందె, తొడుగ మొదలుపెట్టెనా నస్యమునకు నాస్తి కాదూ?

(సభ్యులు విరగఁబడి నవ్వుదురు.)

సింగ——హాస్యము అన్య రసోద్విగ్నులకు ప్రతిక్రియ.

ఆస్థానకవి— (లేచి) చిత్రము, చిత్రము: "పిండఖర్జూరో ద్వేజితస్య తింత్రిణ్యా మివాభిలాషః" అనను మా బోంటి ఒక ఆస్థానకవిః ప్రభువుగారు సర్వజ్ఞులు!

విదూషక— ఆ! ఏమీ! నీబోంటి ఆస్థానకవియా! ఆమాట అనినది, నాబోంటి విదూషకుండా? ఎంతగర్వమన్నా!

మంత్రి— ఇంక ఆస్థానకవి కవితాచమత్కృతులు ప్రభుసన్మానపాత్రము లగుగాక. (ఆస్థానకవినిం జూచును.)

ఆస్థానకవి—(తనలో) అబ్బ! సభలో పద్యము చెప్పి చాల కాలమైనది: ఆ దిగ్దంతులచాటున కాలము బుచ్చుచుంటిని. నేడు వారెవ్వరును రాలేదు. అయినను క్రొత్తవా రెవరును లేరు. గ్రుడ్డిలో మెల్ల! (ప్రకాశముగా) మహాప్రసాదము. కవిత కేమి! కావలయునంత! ఏమి సెలవు?

మంత్రి— ఓహో! నేడు తమరా! మంచిది. ప్రభువరేణ్యుని [illegible] జరిగిన ఇప్పటి సంగీతసభను వర్ణింపుఁడు.

ఆస్థానకవి— ఆ! లెక్క ఏమి! దివ్యముగా!

అతులితశేముషీకలితహావసమంచితదివ్యలాస్యసం
గతిం గమనీయమైన నృపు గాయకగాన మనూన, మప్సర
స్తతి కవమాన, మీ సచివసత్తముం డాగురుం గేరు, మా మహీ
పతి విభవంపుసొంపు తలవంపు నిలింపుల తేని కెయ్యెడన్.

(అట్లుగా చదివి, గర్వముతో సభవంకఁ జూచును. సభలో హర్షము.)

విదూషక— (మెల్లఁగా) నేనీ పద్యము నిదివఱ కెచ్చటనో వినినట్లు జ్ఞాపకము.

ఆస్థానకవి— (మెల్లఁగా) నీయిల్లు బంగారముగాను పరువుదీయకుము.

మంత్రి— మిక్కిలి మనోజ్ఞముగా నున్నది. "తలవంపు నిలింపుల తేని" తథ్యము. ముమ్మాటికి. (రాజును జూచును.)

సింగ—(నవ్వుచు)మన కవి మంచి ప్రతిభ గలవాఁడు."కవికోకిల" బిరుదముతో నీ హారమును బహూకరించుచున్నాము.

(మంత్రిచేతి కిచ్చును.)

విదూ— నీహారమా! ఎందులకు? చల్లఁదనమునకై మాడున కట్టుకొనుటకా!

మంత్రి— (నవ్వి) నీహారము కాదయ్యా, హారము. (కవిని జూచి) కవీ! రాజశేఖరు లపరభోజులు. దీని నందుకొని. రాజయశోబింబమును వాఙ్మయబద్ధ మొనర్చి కవిత్వసంపదను సార్థక మొనర్చుకొనుము.

ఆస్థానకవి— మహాప్రసాదము. ప్రభువరేణ్యుని కీర్తి, తనివిదీర గానముచేయుటకు ఆదిశేషావతార మెత్తకపోయితినే యని కించబడు చుందును. (హారము తీసికొని కనుల కద్దుకొనును.)

విదూ— (మెల్లఁగా) ఈ యైన అవతారముతోనే మొత్తు కొనుము.

సేనకుఁడు — (నేలకంట వంగి నమస్కరించి) ఎవరో కవు లఁట! కళామందిరద్వారముకడ ఆజ్ఞకై వేచియున్నారు.

ఆస్థానకవి— (గుండె ఝల్లుమన బెదరిచూచుచు)కవులా!మంచిది.

సింగ— (మంత్రినిఁ జూచి జనాంతికముగా) కవు లఁట! మన ప్రధానాస్థానకవి శతఘంటము పేరుభట్టుగారు గ్రామమున లేరు కాఁబోలు!

మంత్రి— (మెల్లఁగా) చిత్తము. కాశీయాత్రకై ప్రభువుగారి యాజ్ఞఁగైకొని సకుటుంబముగఁ బ్రయాణమై మొన్న వెళ్లినారుగదా!

సింగ— ఔను;ఔను. మఱి,"రాజసభాభూషణ"బిరుదాంకితులు, పండితకవులు, వీరేశ్వరశాస్త్రిగారును నేఁడు సభ నలంకరింపమికిఁ గారణము?

మంత్రి— చిత్తము.బంధుగృహమున వివాహమున కాహూతులై ఓరుగంటికి వెళ్ళి రని తెలిసినది.

సింగ— (తలయూఁచి) చూతము. (సేవకునితో) ఓరీ! మంచి సమయమునకు వచ్చినారు. ఆ కవులను సభలోనికిఁ బ్రవేశపెట్టుము.

సేవకుఁడు— ప్రభువరేణ్యుల ఆజ్ఞ. (నిష్క్రమించును.)

మంత్రి — (మెల్లఁగ) సర్వకళాశోభితులగు నృపచంద్రుల మోఁల ఏ కవిగణ మైనను నక్షత్రగణమువలె వెలవెలఁ బోవలసినదే! నామ మాత్రమున కీ వృద్ధకవి యున్నాఁడు. చాలును. (రాజును జూడ రాజు చిరునగవుతోఁ దల యూఁచును.)

భోగిని— (నవ్వుచు మెల్లఁగ) సర్వజ్ఞులు సభ దీర్చియుండ సాధ్వస మేల?

సింగ— (మెల్లఁగ) హృదయభాగిని భోగిని రసవాహినివై యపాంగతరంగములఁ బఱపు సర్వజ్ఞునకు మాత్రము సాధ్వసము కాదా! (నవ్వును.)

భోగిని— పంచాస్యులు; ప్రసంగముల కరుదా?

(ఇద్దరు నవ్వుకొందురు.)

విదూ— వుండుపై పుడుక; ఇంతటితోఁజాలక ఈకవు లెక్కడి నుండి దాపురమైనారు దేవుఁడా! కాదుగాని ఈమధ్య ఈ కవులపుట్ట పగిలిన ట్లున్నది. కర్మము

(శ్రీనాథపోతనులు ప్రవేశింప అందఱు నమస్కరింతురు)

శ్రీనాథుఁడు— (చేయి పైకెత్తి ఉచ్చైస్స్వరమున)

స్వస్తి! సమస్తవైరికులసాగరగర్వనిబర్హణక్రియా
శస్తచరిత్రశాలిఘటసంభవకీర్తికి, బాహుకోటివి
న్యస్తమహామహీసువహానాధికతోషితశేషచక్రికిన్,
ప్రస్తుతరాజరాజఘనవైభవశాలికి, రాజమౌళికిన్.

(అందఱు హర్షముఁ బొందుదురు.)

పోతన—

రాముఁడు. రావణప్రముఖరాక్షసపర్వతపక్షభేదను
త్రాముఁడు, జానకీహృదయతామరసస్ఫుటనోత్థపద్మినీ
కాముఁడు. దేవమానిగణకాంక్షితనాముఁడు, రక్షితామర
స్తోముఁడు, రాజ! నీకు నిడుఁ దోరపుఁగల్మిలు సాధురక్షకై.

(సభలో హర్షధ్వనులు)

మంత్రి— కవివరులారా! ఈయాసనముల నాసీనులుగండు.

సింగ— మీనామధేయము లెవ్వి!

శ్రీనాథుఁడు— ప్రభూ! నేను "శ్రీనాథుఁడను"

భోగిని— (మెల్లఁగ) చక్కని పేరు.

సింగ— పేరుమాత్రమే కాదు! నోరుకూడ. (మెల్లఁగ ననును)

పోతన— నన్ను "పోతన" అందురు.

సింగ— మీ దేయూరు!

శ్రీనాథుఁడు— (లేచి) రాజకంఠీరవా! మావి వేర్వేరు గ్రామములు. అందు నాది,

"పరరాజపరదుర్గపరవైభవశ్రీలఁ
గొనకొని విడనాడు కొండవీడు
పరిపంథిరాజన్యబలముల బంధింప
గురుతైన యురిత్రాడు కొండవీడు
చటులవిక్రమకళాసాహసంబొనరించు
కటిలారులకు జోడు కొండవీడు
ముగురు రాజులకును మోహంబుఁ బుట్టించుఁ
గొమరున మించిన కొండవీడు

చటులమత్తేభసాహస్రసారవీర
భటనటానేకఘోటకప్రకటగంధ

సింధురార్భటమోహనశ్రీలఁ దనరు
గూర్మి నమరావతికి నీడు కొండవీడు"

మంత్రి— (ఆశ్చర్యముతో) ఆ! ఏమీ? ఆ చెప్పరాని "కోమటి వేమన్న" పురమా, మీ కాపురము? (రాజువంకఁ జూచును. రాజు నవ్వును.)

సింగ— (పోతనఁ జూచి) మీనివాసము!

పోతన— ప్రభూ!

కమ్మని వేదగానసుధ కర్ణపుటంబులఁ జిమ్మ నెమ్మి నా
కమ్మన భూసురాగ్రిణులఁ గన్నులపండువు సేయు పుణ్యయ
జ్ఞమ్ముల ధూసరాజి వృజినమ్ములఁ గ్రుమ్మెడు నిమ్మహీస్థలిన్
బమ్మెర నానివాసము, సువర్ణవిలాసము, శ్రీనివాసమున్.

మంత్రి— (తొందరతో) బమ్మెరయా? బమ్మెర! ప్రభువరేణ్యా! ఈకవి మన బమ్మెరవాఁడఁట!

ఆ-క—(మెల్లఁగా) బమ్మెరయో! గిమ్మెరయో! వీరి వాలకము చూడఁజూడ నాగళకపిత్థమువలె నున్నది. ఈనాఁటి ముప్పు దప్పినచో దేవు తప్పక సత్యనారాయణవ్రతము చేయుదును.

సింగ—మనబమ్మెరవాసియా! ఇంతదగ్గఱనుండియు మన కవితా గోష్ఠుల కెన్నడును వచ్చినట్లు లేదే!

ఆ-క—[తలను అడ్డముగా నూఁచుచు] లేదు. ప్రభూ! లేదు. నేను గూడ ఈ బాలకవి నెప్పుడును జూడలేదు. [హె హె హె, నవ్వును.]

శ్రీనాథుఁడు—"నరత్న మన్విష్యతి మృగ్యతేహి తత్" అదియును గాక, ఈతనికి మోమోటమి మెండు. అందుచే నంత తొందరగ రాజసభలకుఁ బరువులెత్తు స్వభావ మలవడలేదు. నాబలవంతముచే నిప్పుడైన నిటు ప్రభుకవితాగోష్ఠులఁ బాల్గొనుచున్నాఁడు. పాండిత్య, కవిత్వసంపదలకుఁ దగినంత గర్వసంపదయే మాబావగారికి నుండి

యున్నచో ఈవఱకెన్నఁడో శ్రీసింగభూపాలు మన్ననలందియుండెడి వాఁడు. [పోతనఁ జూచి నవ్వును. పోతన వినమ్రుఁడగును.]

విదూ——ఆ సంపదను మఱియొకరు స్వార్జనముగా సంపాదించుకొనిరి లెండు. [అని ఆస్థానకవివంకఁ జూచును. ఆస్థానకవి ఊరకుండుమని సైగఁ జేయును.]

సింగ—— రత్న మెప్పుడో యొకప్పుడు గుర్తింపఁబడక పోదు. మొగలిపూవు దాఁచిన దాఁగునది కాదుగదా! [భోగినిఁ జూచి మెల్లఁగా] సత్యమా?

భోగిని——సర్వజ్ఞుల వాక్కునుండి యసత్య మెట్లుఁ వెల్వడును? [భ్రూవిక్షేపము]

ఆ-క——ప్రభువుగారి పలుకులు రత్నపుఁ దళుకులు. ఆహా! వారి మాటలలో నెంతయో భావ మిమిడియుండును. సత్యమే! రత్నములో, ఱాలో ఒఱసి యెత్తుకట్టినఁగాని సరసు బయటపడదు. మాటల కేమి కోటలు దాఁటును. [సభవైపు గర్వముతోఁ జూచును.]

విదూ——రత్నపరీక్షలలో నారితేరిన తమరుండ వెల దెలియుట కెంతసేపో పట్ట దనుకొందును!

రాజు——[మంత్రివైపు కనుసన్న సేయును]

మంత్రి——ఆస్థానకవీ! వీరి కవితాశక్తి నొకింత పరీశీలింపుము.

ఆ-క — [మెల్లఁగా] బెల్లముకొట్టిన ఱాయివలె మూఁగనోముపట్టి కూర్చుచుండిన తేఁ డేమనుకొనునోయని భేషజముగా ఏమేమో నోరు జారితిని. కొంపదీసి కథ అడ్డము తిరుగదుగదా! [బిగ్గరగా] చిత్తము. [కవులనుజూచి] ఓబాలకవులారా! మిమ్ములనే! చూడుఁడు! నేనిచ్చు విషయమునుగూర్చి ఒకపద్యము చెప్పిప్రభువుగారిమెప్పునకుఁబాత్రులు గండు. రాజాస్థానము సుమా! రట్టు తెచ్చుకొనకుఁడు. జాగ్రత్త!

శ్రీనాథుఁడు——[కండ్లుఱిమిచూచుచు]ఏమీ! మాకా హెచ్చరికలు! అన వేమభూపాలకాస్థానకవులకు వాకట్టుగట్టిన వాగ్విభూతి

రాజాధిరాజు శ్రీరాయల కవిగోష్ఠి మంత్రబద్ధము సేయు మహితశక్తి
దక్షిణాధీశు విద్యాధికారికి శృఙ్గభంగంబు జేయు నపారయుక్తి
మామిడిసింగన మంత్రిశేఖరు నిల్పి మెప్పులు గొన్నట్టి మేటిపటిమ

ప్రబలసర్వజ్ఞసింగభూపాలచంద్ర
రసికకవితాసభాస్థలి రాణ మెఱసి
రత్నహారము లందునో! రట్టు పడునొ!
బడుగుకవి! చూత మిప్పుడే గడియలోన.

పోతన—— (మెల్లఁగ. వారించి) తొందరపడకుము. ఆత్మప్రశంస ఆత్మహత్యవంటిది సుమా! కవితాపాటవమును గార్యరూపమునఁ జూపినఁ జాలును. మాటలేల మనకు?

శ్రీనాధుఁడు——అనునయము నల్పజ్ఞతనుగా నెన్నయిందు నన్యాయ కాలమున నాత్మగోపన మనర్థదాయకము.

ఆ-క—— (తనలో) అమ్మయ్యో! గొఱ్ఱెపిల్ల యనుకొని కొదమ సింగమును దాఁకితినే! కానిమ్ము! ఆఁటఁ దలనిడి ఆఁకటిపోటునకు వెనుదీయ నేల? పైన దైవ మున్నాఁడు. (బింకముగా) ఆఁ! ఆఁ! 'బడుగుకవి!' ఔరా! ఆస్థాన మనిమైనఁ జూడక అంత మాటయే! "పిల్లకాకి కేమి తెలియునురా! ఉండేలు దెబ్బ" యని దుడుకుతనము! ఇదిగో, యిప్పుడే వదలించెద. కొంచె మాఁగుడు. (ఆలోచించును.)

పోతన—— వృద్ధులు, గుణసమృద్ధులు. వాత్సల్యబద్ధులై మా నేర్చిన విద్యలఁ బరీక్షించి ప్రభువునకు మాకొలఁది నివేదింపుఁడు. సిద్ధముగా నున్నారము.

ఆ-క—— (తనలో) ఆఁ! బాగుగాఁ దోఁచినది. దుష్కరప్రాస మిచ్చి దుష్కీర్తిపాలు జేసెదను (ప్రకాశముగా) సిద్ధముగ నున్నారా? ఓ బాలకవులారా! ఇటుచూడుఁడు. 'క్ష' ప్రాసముతో చంపకమాలను గూర్చి రాజవమాళి కంఠహారముగాఁ జేసి యానందింపఁ జేయుఁడు. చూతము పలుకులపస. ఎహె! హె! (బింకముగా సభవంక జూచును.)

పోతన— (చిఱునవ్వుతో) ఏమీ! చంపకమాలయా? 'క్ష' ప్రాసమా? బాగుగానున్న దీ ఛందోవిజ్ఞానము!

విన్నావా కలనైన నిట్టికవితల్ విద్వత్సభావేదులం
గన్నావా! ఎకసక్కెమా? కవులతోఁ గయ్యాటమా? కోటలో
(శ్రీనాథుఁడు— (అందుకొని)
తిన్నావా? మఱి నల్లమందు; తలకుం దిమ్మెక్కెనా? కాదు లే
దన్నావా? సరి చూడు 'శాస్త్రి' యగు నో ఆస్థానవిద్వాంసుఁడా!

సింగ— (చిఱునవ్వుతో మెల్లఁగ) సరియగు సంబోధనము! వినోదముగ నున్నది. మఱికొంత సాఁగనిచ్చెదను.

విదూ— "ప్రథమకబళే మక్షికాపాతః" కథ రక్తి గట్టినట్లే. నేఁ డెవ్వరిముఖము చూచితివయ్యా! లేవఁగనే. (ఆస్థానకవిని జూచి నవ్వును.)

ఆ-క— (నాలుక కఱచుకొని తనలో) అయ్యో గ్రహచారమా! దురాగ్రహము దూరాలోచనఁ జేయనీయదు. పరువుపోకుండఁగ దీనినే సమర్థింపఁ బాటుపడెదను. (బిగ్గరగా బింకముతో) ఆఁ! ఏమీ! ఆ ప్రల్లదనము! ఏదియో తొందఱలో నోరుజారి ఉత్పలమాల యనుటకుఁ జంపకమాల యంటిని కాఁబోలు! ఏదేనొకమాల! జపమాల! పెద్దవాఁడను. "గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిఱించినదఁట" దీనికే యింత ఆర్భాటమా? "శాస్త్రి" ఔరా! నాకే? సరియేకానిండు. ఆఁ! ఆఁ! ఆయుత్పలమాలయే చెప్పుఁడు.

విదూ— పెద్దతనము పెన్నిధానమై రక్షించినది తమరిని! ఒక్కొక్కప్పుడు వికారములుకూడ సహకారము లగునుగదా!

(అందరు నవ్వుదురు)

పోతన— ఇదిగో చెప్పుచున్నాము. అవధరింపుఁడు.

రక్షణ రామభూవిభుఁడు, రాజసరీతికి రాజరాజు, సం
శిక్షణ దండధారి, సిరి శ్రీశుఁడు, బుద్ధి గురుండు, దాతృతా

శ్రీనాథుఁడు— (అందుకొని)

లక్షణమందుఁ గర్ణుఁడు, విలాసములం గుసుమాయుధుండు, నో
త్ర్యక్షణ తేజ! నీకు సములా! ముదితాంగన! రావుసింగనా!

(అందరు హర్షనాదములు సేయుదురు.)

సింగ— (మెల్లఁగ భోగినితో నవ్వుచు) ముదితాంగన యఁట! చూచితివా! ప్వరి యాగడము.

భోగిని— (మెల్లఁగ చిఱునవ్వుతో) ఉన్నమాటయనిన ఉలుకెందులకు? (ఇద్దరు నవ్వికొందురు)

సింగ— (బిగ్గరగా) భళి! ఆశువులో ఏ రందె వేసినవారు!

మంత్రి— భూపాలశేఖరుని మెప్పువడసిన కవియుగ్మము ధన్యము.

విదూ— ''పిట్టకొంచెము కూఁత ఘన''మనినట్లు బాగుగనున్నది.

ఆ-క— (త్వలో) అబ్బా! ఆ సరస్వతి వీరి వశవర్తిని యైనట్లున్నదే! ఆశువు వ్వరి నడ్డదు. (ఆలోచించి) ఊఁ! సరియే సమస్యనిచ్చి సాఁగఁదీసెదను. (ప్రకాశముగ) ఏదో! ఉన్నది; ఉండవలసినట్లు! ఆ ఆశువు నటుంచుఁడు. ఇదిగో! ఈసమస్యను చక్కఁగా పూరింపుఁడు. ''కుక్కవో, నక్కనో, పులివో, కోతివో, పిల్లివో, బూతపిల్లివో''

పోతన— (ఎగతాళిగ)సమస్యయు సరసముగనే యున్నది. చిత్తగింపుఁడు.

"తక్కక రావుసింగవసుధావరుఁ డర్థుల కర్థమీయ నే
దిక్కును లేని కర్ణుని, దధీచిని, ఖేచరు వేల్పుచెట్టుఁ బెం

శ్రీనాథుఁడు— (అందుకొని)

పెక్కిన కామధేనువు, శిబీంద్రుని వేఁడఁగ నేల? యాచకా!
కుక్కవో? నక్కవో? పులివో? కోతివో? పిల్లివో? బూతపిల్లివో?

అందరు—మిక్కిలి బాగుగా నున్నది! మిక్కిలి బాగుగానున్నది!

సింగ—— (కనుబొమ లెగురవేయుచు) వీరి సమయస్ఫూర్తి చాకచక్యములు శ్లాఘ్యములు.

మంత్రి——ప్రభువులకీర్తి పద్యమున యథార్థముగఁ బ్రతిఫలించినది.

ఆ-క—— (మెల్లఁగ) ఊఁహూ! (పెదవివిఱచి) లాభములేదు. ఏది యిచ్చినను పిలశపిలాయమానము. అయినను ఒకొక్కనినే పట్టి చూచెదను. (బిగ్గరగా) ఇదిగో! ఏన్నె! నీ పేరేమి? శ్రీనాథుఁడా! ఇది నీవంతు! "కుక్క సామజ మగుఁజే" ఇహిహి! (నవ్వుచు) ఈ సమస్యను పూరింపుము. తొందఱగ కానిమ్ము.

శ్రీనాథుఁడు—— నవ్వుచు, ఓహో! సమస్యలు గావు స్వర్ణశకలములు! ఇదిగో! పూరించుచున్నాను.

"సర్వజ్ఞనామధేయము
శర్వునకే, రావుసింగజనపాలునకే
యుర్విం జెల్లును; నితరుఁడు
సర్వజ్ఞుం డగుట కుక్క సామజ మగుఁజే."

సింగ—— అనుపమానము. ఆహా! (సభలోఁ గరతాళములు.)

ఆ-క—— (తనలో) ఈతనికి దత్తపది నిచ్చి చూచెదను. (పోతన నుద్దేశించి) ఇది నీపని. "భూషణములు", "భాషణములు", "మోషణములు", "తోషణములు" ఈపదములను వరుస దప్పనీయక కందములో లేని కర్ణముల కందముగఁ బొందుపఱచి యానందింపఁజేయుము.

పోతన—— చిత్తము. (ఒక్కగుక్కలో)

భూషణములు శ్రుతులకు నీ
భాషణములు, చూపు లాత్మభవుతూపులు హృ
న్మోషణములు, చరితలు సం
తోషణములు కామినులకు దోర్బల! సింగా!

విదూ——"మౌనం సర్వత్ర భూషణమ్" ఈయురవడిలో నీమంత్రమే సరియగు సిద్ధి నిచ్చునది. (ఆస్థానకవినిఁ జూచుచు) పాపము! ఈతఁ

డీ యుడక త్తెరలోఁ బోఁకచెక్క యగుచు నున్నాఁడు. అయినను "చేసికొనినవారికి చేసికొనినంత మహాదేవ!" అనుభవింపవలసిన దే!

సింగ—(తనలో) చూడఁజూడ వీరి ప్రతిభముందు మా వృద్ధకవి "దివిటీముందు దీప" మగుచున్నట్లున్నాఁడు. ఈబాలకవులతో నేనే న్యాయముగ నే శాస్త్రార్థములకో దిగుటయు న్యాయ్యముగఁగన్పింపదు. వీరిలో మహాకవులును,బండితులును గాఁదగు లక్షణములు స్పష్టముగఁ గాన్పించుచున్నవి. ప్రశంసావాక్యములఁ బ్రోత్సహించుచు పరీక్షల నాపించెదను. (బిగ్గరగా) వీరు బాలురయ్యు సమర్థులగు కవు లనుటకు సందియము లేదు. మల్లికాపరిమళమువలె వీరి కవితాసౌరభము మాహృదయమున కానందము గల్గించినది. కాన, రసప్రతిపక్షములగు పరీక్షల నాపించి సరసకవితామకరందము నాస్వాదింప నున్నారము.

ఆ-క—(మెల్లఁగా) బ్రతుకు జీవుఁడా! ఈ గడుగ్గాయలు శాస్త్ర వాదముల కెక్కడ దిగుదురో యని గుండెలు దడదడ లాడుచున్నవి. (బింకముగా) బాలకవులారా! ఏదో "స్థాలీపులాకన్యాయము" గా మీమీ శక్తులం బరీక్షించితిని. "పిచ్చుకపై బ్రహ్మాస్త్రమా" యని యేదో పైపైనఁ బోనిచ్చితిని. దాని కేమిగాని ఇదిగో! ఇటు చూడుఁడు! మా ప్రభువరేణ్యుని హృదయమా రసభాజనము. ఇఁక రసకవిత్వముఁ జెప్పి యీ భూలోకదేవేంద్రు నానందింపఁ జేయుఁడు. భయపడకుఁడు సుమా! వెన్నంటి నేనుంటినిగా! (అని గర్వముతోఁ జూచును.)

విదూ—"చింత చచ్చినను బులుపు చావలే"దని చూడు! "చావుదప్పి కన్ను లొట్ట బోయినంతే"పని. య్యైనదిగదా! ఇప్పటికైనను ఆడంబములు మానునా! ఉఁహుఁ! అమ్మ పెట్టేవి నాలుగు పెట్టవద్దూ?

సింగ—(మంత్రినిఁ జూచి కనుసన్న సేయును.)

మంత్రి—(శ్రీనాథునితో) ప్రభుచంద్రుని కీర్తిని మీరొక్కరే వర్ణింపుఁడు.

శ్రీనాథుఁడు— చిత్రము! మహానందము. కవుల కింతకన్నఁ గావలయున దేమున్నది? (కను లఱనిముసము మోడ్చి) అవధరింపుఁడు.

లాటీమానసరాజహంస, కుకరీలాలాటికాభూష, క
ర్ణాటీగాన సుధాస్రవంతి, కుహళీనారీమతల్లీలస
త్పాటీరాంకము, చోళసుందరదనాధమ్మిల్లసౌగంధియై
కోటీరోజ్జ్వల! నీదుకీర్తి యెసఁగుఁ గోదండపాణ్మాతురా!

భోగిని— (నవ్వుచు మెల్లఁగ రాజును జూచి) ఓహో! ఈ పద్యములో రసికశేఖరులగు రాజుగారి రహస్యము రచ్చ కెక్కినది లెండు! దక్షిణనాయకులగు వారికి దాక్షిణ్యమునకుఁ గొదువ యుండదుగదా!

సింగ— (మెల్లఁగ) కొంచె మోపికపట్టినచో నాయికాస్వరూపము మాత్రము నడువీధి కెక్కకుండునా? చూతము!

(ఇద్దరు ముసిముసి నగవులు నవ్వుకొందురు.)

విదూ— కవితను గాలకూటవిషముగ భావించు నాకే ఈ పద్యము పనసపండును దోపించినది. కావున, ఇది తప్పక రసకవితయే యని సిద్ధాంతము! తప్పదు!

సింగ—(నవ్వుచు) విదూషకుల రాద్ధాంతము విద్వాంసుల కొకప్రశంసాపత్రము! (మంత్రినిజూచి, భోగినిని, పోతననుజూపులఁజూపును.)

మంత్రి—[పోతనఁజూచి] కవీ! అదిగో! [భోగినిం జూపి] అటు చూడుము. ఆ సురఁటి వైచుచున్న కాంతయే రాజహృదయము నాకర్షించిన భోగిని. నీనేర్పు మెఱయ నీమెను వర్ణించి రాజప్రసాదమునకుఁ బాత్రము గమ్ము.

సింగ—[భోగినిఁజూచి] మంత్రి మంచి యవకాశమును జేకూర్చెను. ఔనా! (నవ్వును.)

భోగిని—(చురచురఁజూచుచు) తమ గడుసుచూపులు గలుగఁ జేసిన వనరాదూ! చాలులెండు! నేర్చుకొన్నారు!

పోతన—[ఒడలు జలదరింపఁ దనలో] అయ్యో! కర్మమా! వర కవిత్వమునకు వారకాంతావర్ణనమా ఫలము? (ఆలోచించితలయూఁచి) ఔను, కాదనినఁ గష్టముగ నుండునేమో! ఒక్క పద్యముతో నేదో ప్రొమొక్కు దీర్చికొనెదను. [ప్రకాశముగ] చిత్తము. సచివశేఖరుల యాజ్ఞ.

వాణి మరందధార, ఘనవారుణి శాతకటాక్షపాళి, సం
ప్రీణన మాననంబు, విధుబింబము గండము. శ్రీకృతుల్ శ్రుతుల్,
వేణి మిళిందపంక్తి, యలివేణికిఁ గాముని రాణియేమి యిం
ద్రాణియు సాటిరాదు, సురతాణిని మించిన రావుసింగనా!

అందరు—[హర్షధ్వనులు సేయుదురు.]

సింగ—[భోగినిఁజూచి మెల్లగ] ఔరా! భోగినీసౌందర్యాభోగము! రతికి మది చెడినది. శచి రుచి గోల్పోయినది! [నవ్వును]

భోగిని— చాలులెండు నేర్చుకొనిపోవుదురు.

సింగ— మహానందము! ఈ జంటకవులను మణిహారయుగళముతో బహూకరించుచున్నాము.

మంత్రి—[హారము లందుకొని] కవీశ్వరులారా! మహేంద్రప్రసాదముఁబోని మా రాజేంద్రు ననుగ్రహాసాదితము దీనిఁ గొనుఁడు.

శ్రీనాధ, పోతనలు—మహాప్రసాదము, మహాప్రసాదము. (హారము లందుకొని ధన్యవాదము చేయుదురు)

సింగ—ముత్తెముల కోవవలె సుందరమై రసబంధురమగు నీకవుల కవితకు మాహృదయము త్తరంగిత మైనది. ఈచివరపద్యము మా భోగినికి హృద్యమగు నొక మణి. (భోగినివంక నవ్వుచుఁ జూచును. [భోగిని గునియుచుఁదలద్రిప్పికొనును] ఏమది! ఒక మణియేనాయనియా! కవితామణిఖని మన పెరటిలోనిదే లెమ్ము; మణిహారము చేయింతుములే!

అ-క—— ఓ ! ఒక పద్య మేమి లెక్క! పద్యశతంబులకుఁ గాదు ప్రబంధశతంబులకు నీమె తగినది గదో! పెద్దవాఁడనని యాలోచించుచుంటి నిగాని, లేకున్నచో నీపాటికి ఒక ప్రబంధము నే గ్రథించియుండనా?

విదూ——కవులలోఁ దమరు కవులలో జాంబవంతునకే ఉద్ది! వానికి కాలిలో పోటు! మీకు కావ్యములో పోటు!——

మంత్రి— ప్రభూ! నిజము. సురేంద్రుఁబోని నరేంద్రు నాకర్షించిన నారీలలామ కామాత్రము మణిహారము లేకుండుట పాడిగాదు. (ఆలోచించి మెల్లఁగ) తేని హృదయమును గ్రహించితిని (ప్రకాశముగ) కవిచంద్రులారా! మీకవిత భోగినీవనితవలె ప్రభువు డెందమును చూఱఁగొనినది; ఇంకేమి కావలయును ?

శ్రీనాథుఁడు — ధన్యుల మైతిమి. ఇంకేమి కావలయును? అనేక రాజాస్థానములఁ గవితారీతుల రంజిల్లఁజేసినను సర్వజ్ఞుల సంతసిల్లఁ జేసి కాని మా కాత్మప్రత్యయము గలుగలేదు. నేటికి కృతకృత్యుల మైతిమి.

సింగ—— మీప్రతిభయే మీ కెల్లకాలములం దెల్లయెడలను గౌరవముఁ జేకూర్పఁగలదు.మీయనవతరసన్నిధిమా కానందముఁగూర్చును.

శ్రీనాథుఁడు—— చిత్తము. చిత్తము. "విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమ"మ్మనుమాట ప్రత్యక్షరసత్య మైనది. భోజాస్థానము మించు నీ రాజాస్థానము పుణ్యములచేఁగాని పొందరానిది.ఎల్లప్పుడిందు రంజిల్లుట కోల్లనివా రెవరు? కాని, నేను దూరమం దుండువాఁడను. అయినను.ప్రభుచిత్తమునకు వచ్చినపుడు కాకిచేఁ బిలువనంపిన వచ్చి వ్రాలుదును. ఇఁక, మా బావయో మీ పంజరపు చిలుక. కోరినపుడు కోరిన పలుకులు పలికించుకొనవచ్చును. (పోతనఁజూచి నవ్వును.)

మంత్రి—. మీ బావగా రేదియో ఆలోచించుచున్నట్లున్నారు ?

శ్రీనాథుఁడు—— (నవ్వుచు) అతఁడు ఆవులించిన ప్రేవులు లెక్కపెట్టువాఁడు. మీ రీయఁబోవు విషయమును పసిపట్టి "యెట్లుపక్రమించుటో" యని తలపోయుచున్నాఁడు.

మంత్రి — సత్యము. నిండుకుండ తొణఁకదుగదా! (పోతనఁజూచి) పోతనకవీ! ప్రజ్ఞావంతుఁడవగు నీవు మా పాలితులలోనుండియు నింత దనుక ప్రభుదృష్టికి రాకుంటివి. నేఁటికి లక్ష్మీసనాథుఁ డగు భూనాథుని కటాక్షము నీపైఁ బ్రసరించినది. నీ పంట పండినది. చూడుము! నీ మధురకవిత్వమును మెచ్చించి మానినీమణి యగు భోగిని కొక పద్యమణిహారమును సంతరింపుము. రాజానుగ్రహమున దారిద్ర్యసముద్రమును తరింపుము!

అంనకు — చక్కని యూహ! మంచిపని మంచిపని.

సింగ — ఇది మా యభీష్టము.

పోతన — (పిడుగుపడిన ట్లయి మెల్లఁగ) భోగినికా! ఒక గ్రంథమా! పూతకవితా! నీవు భోగినిపాలఁ బడెదవా! పోతనా! రాజుల పజ్జఁ జేరినప్పుడే రాజమార్గమును దప్పితివి. దీనికి వెనుదీయుదువా? రసనమా! నీరాక్షసకృత్యముల కిది తుది. దారిద్ర్యమా! నీ పైశాచిక నృత్యమున కంతిమ దృశ్య మిది. అయ్యో! భోగినిపైఁ గవిత్వము సెప్పక తప్పదా! ఎటు తప్పించుకొనఁ గలుగుదును? రాజవాంఛితమును గాదనఁగల శక్తి లేదుగా! కట్టా! (ప్రకాశముగా) చిత్తము. మంత్రులయాజ్ఞ మన్నింపక తప్పునా!

శ్రీనాథుఁడు — బావగారు ప్రబంధమునకు పతక మల్లిన ట్లున్నారే!

సింగ — (సంతసముతో) ఇదిగో! ఈ చందన మలఁదికొనుఁడు. ఈ కర్పూరతాంబూలమును స్వీకరింపుఁడు.

పోతన — (వడఁకుఁ జేతులతో నందికొనుచు) యత్నింతును. ఈ బహూకృతికి నా గుణసంపద కాదు కారణము...

సింగ — పాపము! అమాయకుఁడు. తన బలమును దా నెఱుంగఁడు. ఈతని నడవడి, కవుల కొఱవడి.

శ్రీనాథుఁడు — ప్రభుకల్పతరువు చల్లని ఛాయాప్రసారము మాపైఁ బడినది. మేము ధన్యులము. సర్వజ్ఞులు, అచిరకాలముననే గ్రంథము నవలోకించి యానందింపఁగలరు.

మంత్రి— సత్యము. సర్వజ్ఞులు సంకల్పసిద్ధులు. ఓ కవులారా! మీ కవితారీతులకు నృపాలశేఖరుని హృదయ మానందమున నోలలాడినది. ఇప్పటినుండి శ్రీవారి యాస్థానమున జరుగు నాయా యుత్సవములకు తమకై శ్రీముఖ మంపుచుండెదము. తప్పక గోష్ఠులలోఁ బాల్గొనుచుఁ బారితోషికము లందుచుండుఁడు.

శ్రీనాథుఁడు— ఘనపుణ్యముఁ జేసిన కవులకుఁగాని యిట్టిగౌరవము గలుగదు. మహామంత్రుల యాజ్ఞ శిరసావహించి ధరింతుము.

[తెరలో]

అస్తగిరిఁ జేరె నదిగొ గభస్తిమాలి
నీదు ధాటికి సోలుట సేదఁ దీర;
కవులు నీ కీర్తి బాడిరి చవులు దనర
నంగనామంగళాపాంగరంగ! సింగ!

సింగ— ఓహో! అప్పుడే సాయంకాల మైనదా! నేఁటి సంగీతకవితాగోష్ఠులు మిక్కిలి హృదయంగమముగ నుండుటచే ప్రొద్దు తెలియనే లేదు. నేఁటి కిఁక సభ చాలింతుము.

విదూ— అప్పుడే నఁట! అమ్మయ్య! ఆ సూర్యభగవానుని కడుపు చల్లగాను! గుఱ్ఱములను తొందఱగఁ బరువెత్తించెను. ఇంకొక దోసిలి యెక్కువ అర్ఘ్య మిచ్చెదను.

వేత్రహస్తుఁడు— (వేత్రము నెత్తి) “హెచ్చరిక”

[అందఱు నిలుచుండెదరు.]

౧ భట్టు— జయ! ఆశ్రితచకోరచంద్రికాపూర! 
౨ ,, — జయ! సంచితానంతసద్యశస్సార!
౧ ,, — జయ! జయ! సంభోగశ్రీశాలితనామ!
౨ ,, — జయ! జయాంధ్రసీ సత్సార్వభౌమ!

(భోగినితో రాజు నిష్క్రమించును.) (తెర వ్రాలును.)

ప్రథమాంకము సంపూర్ణము.






ప్రథమరంగము—పోతనగృహమునఁ బూజామందిరము.

శారద—(దేవిముందు మోఁకరిల్లి కేలుమోడ్చి) తల్లీ! అటు నా పుట్టినిల్లు, ఇటు నా మెట్టినిల్లు నీ చల్లనిచూపుల నిత్యకల్యాణము, పచ్చతోరణముఁ గావించితివి. నీ కరుణకలిమి నాకే కొఱంతయు లేదు. మా మల్లన్న మల్లకుంతములు పెట్టుచు పరుగులిడుచుండ మైమఱచి యశోదనై యానందింతును. మా చిన్నిలక్ష్మి బోసినవ్వులకు లోలోన మురిసిపోయెదను. (అటు నిటు చూచి, ఎవ్వరును లేరుగద! (మెల్లగ) అమ్మా! పెన్నిధివంటి పెనిమిటిని చేకూర్చితివి. ఎమ్మెల్లప్పుడును గంటికి ఱెప్పవలెఁగాపాడి రక్షింపుము. నీకివే నావందనములు. (నమస్కరించును.) (అలికిడి విని లేచి) అరుగో! స్నానము చేసి వచ్చుచున్నారు. (దైన్యము నభినయించుచు) అదేమో! ఆ మాయరాచకొండ యేమని వెళ్లివచ్చిరో కాని మనసువిప్పి మాటలాడుటయే మానివేసిరి. ప్రీతిమై పిల్లలు పైపైకిఁబోవ పెడముఖముఁ బెట్టి పిలువనైన పిలువకున్నారు. ఆహారముకూడ అఱగడుపుగనే యున్నది. ప్రతిదినము అడిగితీరవలెనని యనుకొనుటయేగాని అదేమో! అడుగలేకున్నాను. ఈ వేళ యేమైనను సరియే! దీని కంతకును గారణ మేమియో కనుఁగొనెదను.

పోతన—(మెల్లఁగ అడుగులు వేయుచు తనలో) ఔరా! అఱనిముసము ఒక్క చోట ఆఁగునిలుచుట లేదు. దొంగతనము చేసినట్లుగుండెలు దడదడలాడుచున్నవి. నలుగురిలోఁ దిరుగుటయు నగుఁబాటుగఁదోఁచుచున్నది. ఓదుర్విధీ! కవిత్వమును గాసుల కమ్మి కడుపు నింపుకొన

వ్రాసితివా? అయ్యో! నేను కవిని గాకుండినను గష్టము లేకుండెడిదే! బావా! శ్రీనాథా! బాంధవుఁడవైనందులకుఁ బట్టుబట్టి బాధలోఁ బడవైచితివా? అయ్యారే! తలఁచుకొనినకొలఁదియుఁదలఁకు గల్గుచున్నదే! ఛీ! ఒక్కొక్కప్పుడీ ఈ బంధనములు త్రెంచుకొని బయటపడెదమా యను బుద్ధి వొడముచున్నది. (ఆలోచించి, నిట్టూర్పువిడచి) వచ్చినమచ్చ చచ్చినను పోదుగదా! (ముందుచూచి) అదిగో! పూజకై సామగ్రి నమర్చుచున్నది. శాంతముగ భగవదారాధనఁ జేసికొనెదను, స్వాంతమునకుఁ గొంత యూఱట గల్గునేమో! (సమీపించును.)

శారద— (పీఁట జరిపి) ఈ పీఁటపైఁ గూరుచుండుఁడు.

పోతన— (విసుపుతో) పిచ్చివానికిఁ బీఁట లేల? పోనిమ్ము.

శారద— ఇదిగో! చూడుఁడు! మీచిత్త మెందులకో మిగుల చీకాకు పడుచున్నది. అఱవిడచి మాటలాడరాయె. ఆఁడుదానను నేను మాత్ర మేమి చేయఁగలను? (గ్రుడ్ల నీరు గ్రమ్మఁ దుడుచుకొనుచు) నానాఁటికి మీ వాలకముఁ జూడఁజూడ దిగులు పుట్టుచున్నది. పోనీ! ఆ యేలేశ్వరపు అనంతయ్యకైనను జేయిచూపి ఏదైన మంచిమందు తీసికొనఁగూడదా? (నిష్ఠురముతో) "స్వయంరాజా స్వయం మంత్రీ" మీకుఁ జెప్పఁగలవా రెవరు?

పోతన— (మెల్లఁగ) నా పాపరోగము నపనయింపఁ బరమౌషధ మీయ అనంతయ్య అసమర్థుఁడు.

శారద— అయ్యో! నా పాపము బ్రద్దలుకాను! పలుకే బంగారమైనదా?

పోతన— (ముఖము చిట్లించి) నా దురదృష్టమునకు నేను దుర పిల్ల నీకీ యుత్తలపా టేల? ఉడుకెత్తింపక ఊరకుండుము.

శారద— (తొందరతో) ఊరకుండక ఉరిపోసికొంటినా? "నా దురదృష్టమునకు" అందురుగదా! మీ దురదృష్టము నా దురదృష్టము గాదా? మీబాధ నాబాధ గాదా? మీ రేమైన ననుకొనుఁడు, నే

బ్రతికియుండగ నీకు బాధ యనుమాట రాఁగూడదు. నేను వినలేను ! సహింపలేను! (దుఃఖించును.)

పోతన— మాటలతో నది పోవునది కాదు. మనోవ్యాధికి మందు లేదు.

శారద— (తొందరతో) ఆఁ! మనోవ్యాధియా ? మనోవ్యాధి! ఎందులకు రావలయును ! మన కేమిలోపము గలదని ? కలిమిలేదా? గౌరవము కఱవా ? తామరతంపరవలె సిరిసంపదయే ! గౌరవమా! రారాజులు రత్నములతోఁ బూజించుచున్నారే! ఇంకేమి కావలయును? మొన్న మొన్ననే కదా! రాచకొండ మహారాజు మణిహారము లిచ్చి మన్ననఁ జేసెను.

పోతన— (కోపముతో) రాచకొండయో! రాక్షసులకొండయో! నామానము మంటఁబెట్టినది. నాకు తీఱని కళంక మాపాదించినది. వినలేను. ఇంక ఆమాట వినలేను. (చెవులు మూసికొనును.)

శారద— (ముక్కుపై వ్రేలిడికొని) మహారాజసమ్మానమున మానన ష్టమెట్లయ్యెనో అర్థమగుటలేదు.

పోతన— ఔను. మీకును మీయన్నగారికిని కావలయునది అర్థమే! తక్కినవి మీకు అర్థము కావు. మీ యర్థలోభమే నన్నీ యపమార్గమున కీడ్చినది. అంధకారమునఁ బడవైచినది. మీ కేమి పోండు. రత్నములతో రంజిల్లుఁడు. ఆణిముత్తెములతో...ఆనందింపుఁడు. (ముఖము త్రిప్పికొనును.)

శారద— (భయము, దుఃఖము పెనఁగొన డగ్గుత్తికతో) నాథా! క్షమింపుఁడు. క్షమింపుఁడు. మీ మనమును క్షోభపెట్టి యీ మణులేమిచేసికొనను ? ( మెడలోని రత్నహారము పట్టుకొని ) నా కివి రత్నములు గావు ; అంపపుఁగోరలు. మీ రనుభవించు ఆ వేదనకు కారణము అర్థమైనది. వలదు. వలదు. ప్రభువులు వలదు. ప్రభు

వ్రాసితివా? అయ్యో! నేను కవివిగా నుండినను గష్టము లేకుండెడిదే! బావా! శ్రీనాథా! బాంధవుఁడ వైనందులకుఁ బట్టుబట్టి బాధలోఁ బడవైచితివా? అయ్యారే! తలఁచుకొనినకొలఁదియుఁ దలఁకు గల్గుచున్నదే! ఛీ! ఒక్కుమ్మడి ఈ బంధనములు త్రెంచుకొని బయటపడెదమా యను బుద్ధి వొడముచున్నది. (ఆలోచించి, నిట్టూర్పువిడచి) వచ్చినమచ్చ వచ్చినను పోదుగదా! (ముందుచూచి) అదిగో! పూజకై సామగ్రి సమర్చుచున్నది. శాంతముగ భగవదారాధనఁ జేసికొనెదను, స్వాంతమునకుఁ గొంత యూఱట గల్గునేమో! (సమీపించును.)

శారద— (పీఁట జరిపి) ఈ పీఁటపైఁ గూరుచుండుఁడు.

పోతన— (విసువుతో) పిచ్చివానికిఁ బీఁట లేల? పోనిమ్ము.

శారద — ఇదిగో! చూడుఁడు! మీచిత్త మెందులకో మిగుల చీకాకు పడుచున్నది. అఱవిడచి మాటలాడరాయె. ఆఁడుదానను నేను మాత్ర మేమి చేయఁగలను? (గ్రుడ్ల నీరు గ్రమ్మఁ దుడుచుకొనుచు) నానాఁటికి మీ వాలకముఁ జూడఁజూడ దిగులు పుట్టుచున్నది. పోనీ! ఆ యేలేశ్వరపు అనంతయ్యకైనను జేయిచూపి ఏదైన మంచిమందు తీసికొనఁగూడదా? (నిష్ఠురముతో) "స్వయంరాజా స్వయం మంత్రీ" మీకుఁ జెప్పఁగలవా రెవరు?

పోతన— (మెల్లఁగ) నా పాపరోగము నపనయింపఁ బరమౌషధ మీయ అనంతయ్య అసమర్థుఁడు.

శారద— అయ్యో! నా పాపము బ్రద్దలుకాను! పలుకే బంగారమైనదా?

పోతన— (ముఖము చిట్లించి) నా దురదృష్టమునకు నేను దురపిల్ల నీకీ యుత్తలపా టేల? ఉడుకెత్తింపక ఊరకుండుము.

శారద— (తొందరతో) ఊరకుండక ఉరిపోసికొంటినా? "నా దురదృష్టమునకు" అందురుగదా! మీ దురదృష్టము నా దురదృష్టము గాదా? మీబాధ నాబాధ గాదా? మీ రేమైన ననుకొనుఁడు, నే

బ్రతికియుండగ నీకు బాధ యనుమాట రాఁగూడదు. నేను విన లేను! సహింపలేను! (దుఃఖించును.)

పోతన— మాటలతో నది పోవునది కాదు. మనోవ్యాధికి మందు లేదు.

శారద— (తొందరతో) ఆఁ! మనోవ్యాధియా? మనోవ్యాధి! ఎందులకు రావలయును? మన కేమిలోపము గలదని? కలిమిలేదా? గౌరవము కలవా? తామరతంపరవలె సిరిసంపదయే! గౌరవమా! రారాజులు రత్నములతోఁ బూజించుచున్నారే! ఇంకేమి కావల యును? మొన్న మొన్ననే కదా! రాచకొండ మహారాజు మణిహారము లిచ్చి మన్ననఁ జేసెను.

పోతన— (కోపముతో) రాచకొండయో! రాక్షసులకొండయో! నామానము మంటఁ బెట్టినది. నాకు తీఱని కళంక మాపాదించినది. విన లేను. ఇంక ఆమాట వినలేను. (చెవులు మూసికొనును.)

శారద— (ముక్కుపై వ్రేలిడికొని) మహారాజసమ్మానమున మానన ష్ట మెట్లయ్యెనో అర్థమగుటలేదు.

పోతన— ఔను. మీకును మీయన్నగారికిని కావలయునది అర్థమే! తక్కినవి మీకు అర్థము కావు. మీ యర్థలోభమే నన్నీ యపమార్గమున కీడ్చినది. అంధకారమునఁ బడవైచినది. మీ కేమి పొందు. రత్నములతో రంజిల్లుఁడు. అణిముత్తెములతో...ఆనందిం పుఁడు. (ముఖము త్రిప్పికొనును.)

శారద— (భయము, దుఃఖము పెనఁగొనఁ డగ్గుత్తికతో) నాథా! క్షమింపుఁడు. క్షమింపుఁడు. మీ మనమును క్షోభపెట్టి యీ మణు లేమిచేసికొనను? (మెడలోని రత్నహారము పట్టుకొని) నా కివి రత్నములు గావు; అంపపుఁగోరలు. మీ రనుభవించు ఆ వేదనకు కారణము అర్థమైనది. వలదు. వలదు. ప్రభువులు వలదు. ప్రభు

సన్మానములును వలదు. భగవంతుఁడిచ్చినది చాలును. మీ పాద మాన! మీ చిత్తమునకు సంతాపము గల్గించు చేతలను జేయవలదు.

(పాదములపై వ్రాలును.)

పోతన— (సంతసముతో లేవఁదీయుచుఁ దొందఱగ) సరియా! ఇఁక నన్ను సాధింపరుగద! 'ధనము, ధన' మని తఱుమరుగద! అమ్మయ్య! బ్రతికితిని. (బిగ్గఱగ ఎలుఁగెత్తి) ఇదిగో! దైవసాక్షిగ శపథము బట్టుచున్నాను. నేనిఁక ఆ భోగలాలసుల, దురహంకారుల, గర్వోత్తుల, రాజరాక్షసుల దరియను. పట్టు బట్టినను, పగఁ గొన్నను పద్యము చెప్పను. కష్టములు రానిమ్ము! కంఠము ఖడ్గధార కెర కానిమ్ము!

శారద— అమంగళము (చెవులు మూసికొనుచు) అబ్బ! అట్టి మాట లనకుఁడు. అట్టిమాట లనకుఁడు. మనకు భగవంతుఁ డున్నాఁడు. ఏ కష్టములు వచ్చినను గడచిపోవును లెండు.

పోతన— సత్యము. అంతయు భగవదధీనమే. (నిట్టూర్పు విడచి) అబ్బ! నీ మాటలతో మనోభారము సగము తగ్గినది. ఇప్పటికే యాలస్యమైనది. ఇఁక భగవదారాధనము గావించెదను. నీవు నీపనులను జూచుకొనుము.

శారద— చిత్తము. (నిష్క్రమింతురు.) తెర వ్రాలును.

ద్వితీయ రంగము — పోతన యింటి అరుగు.

[పోతనశిష్యులు— గంగన, నారయ, సింగనలు గురువుగారి రాకకై వేచియుండి పాతపాఠములు చర్చించుచుందురు.]

గంగన—(నారయఁ జూచి) అయిన చో నింతకు అర్జునుఁ డేమనును?

నారయ— అనుట కేమున్నది? "నమోఽస్తు గోవింద!" అని.

సింగన— (నవ్వుచు) ఏమో! గొప్ప యుద్ధము చేయు వీరునివలె "సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ" అని డంబము లెందుకు మొట్టమొదట యింత అసమర్థునకు?

గంగన—— ఛీఛీ! బిడియము లేదు. "గాండీవం స్రంసతే హస్తా" దఁట. మీఁదుమిక్కిలి "వేపథుశ్చ సంజాయతే" అఁట. ఇది క్షత్రియుఁడనవలసినదియేనా ? మనబోఁటి బాపనయ్య లనవలసినమాట.

సింగన—— ఆఁ! ఆఁ! నీకు బ్రాహ్మణు లనిన అంత చులకన మా? రాజసతామసములు విప్రప్రయోజనము లని వా రుపేక్షించిరే గాని, అందులకుఁ తెగఁబడినిచో నందును గురుపీఠము వా రాక్రమింప వలసిన దే! తెలిసినదా! గండ్రగొడ్డలి చేఁబూని రాజలోకము నుఱ్ఱూఁతలూఁగించి ముయ్యేడు మారులు ఊఁచకోఁతకోసి రక్తతర్పణమునఁ బిత్రుదేవతలకుసంతర్పణముగావించిన ఆపరశురాముఁడెవరు? రాజకుమారులకు ధనుర్విద్యాభ్యాసమున నక్షరాభ్యాసముచేసినకృపాచార్యులు, అఖిలభారతవీరులకుఁ గోదండాచార్యుఁడై మించిన ద్రోణాచార్యుఁడు విప్రులేయని స్మృతి యున్నదా? "అపాండవం కరిష్యామి" యని ప్రతినపట్టిన అశ్వత్థామ, జగదేకవీరుఁడు మనబోఁటి బ్రహ్మచారి యే సుమా! జాగ్రత్త! తెలియక మాటలాడకుము. (ఉగ్రుఁడై చూచును.)

గంగన—— (హాస్యముగా) అమ్మయ్యో! కందగడ్డవలె ముఖము, వీఁడు"అభినవాశ్వత్థామ"యై మీఁదఁబడునట్లున్నాఁడు. ఇఁకలాభము లేదు."జితోస్మి";"అబ్రహ్మణ్యమ్", "అబ్రహ్మణ్యమ్"(అని అఱచును)

నారయ—— (నవ్వుచు) అబ్రహ్మణ్యము లేదు, సుబ్రహ్మణ్యము లేదు. ఊరుకొనుము. అల్లరి గురువుగారికి వినఁబడును.

సింగన, గంగనలు—— నిజమే, నిజమే. (మెదలకుందురు)

నారయ—— మొదటమీరెత్తిన ఆయర్జునునిసంగతి విచారింతము. అర్జునుఁడు మహావీరుఁ డనుటకు సందియములేదు. కాని, ఆతనిదియు మానవహృదయమే! రక్తసంబంధులను, ఆప్తులను,గురువులను,చూచి కసాయివానివలె తలలుసఱకఁదొడఁగొనలేకపోయినాఁడు. ప్రపంచమున నలుదిక్కులకు శాంతిసందేశములను బంపిన ఆర్యరక్తము నాళములలో

నింకను, ఇంకకుండుట, అట్టి పశుబలిప్రయోగమునకు మొదట కొంత పడి కుందినమాట వాస్తవమే. ఏ గానికిఁ గంతములుగోయు నరరాక్షసు లుండ "అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః" అని మహాశ్లోకముల యాధిపత్యము లభించినను ఈరక్తముకూడు నేను తినలేనని, ఇంతకన్న బిచ్చమెత్తికొనుట శ్రేయ మని సర్వశక్తులుగల అర్జునుఁడు, అనినాఁ డనిన అది యాతని సౌజన్యమునకు గుర్తుగాని పిఱికితనమునకుఁ జిహ్నము కాదు.

గంగన— నీవు బడిపంతులుగా నుండఁ దగినవాఁడవు! ఎంత చిక్కు విషయమునైనను విప్పి చెప్పఁగలవు (సింగనను జూచి) ఇంక మనసందేహము తీరినట్లేగదా!

సింగన— (నవ్వి తలయూఁచుచు) అవునుగాని మన గురువుగారు ఆయర్జునవిషాదయోగమును ఎంతచక్కఁగాఁ బాఠము చెప్పుచున్నారు?

గంగన— వారిది ఋషిహృదయము; సర్వజ్ఞులు— వారేది సెలవిచ్చినను అర్థవంతమైయుండును.

నారయ— వారిది సహజపాండిత్యము. వారివిజ్ఞానసముద్రమునకు ఎల్లలు లేవు.

గంగన— సత్యము. ఆఛందస్సు చెప్పునప్పుడు చూడవలయును వారి చాకచక్యము! మనమొక పాద మల్లునప్పటికి, వారు పది పద్యములను చెప్పి వేయుదురు.

సింగన— నేఁడు గురువుగా రింత ప్రొద్దెక్కినను దయచేయ లేదేమో?

గంగన— వారు గొప్ప కర్మఠులు - అనుష్ఠానమున నాలస్యమైన దేమో!

నారయ— అబ్బ! వారి శాంతి! ఒక్కనాఁడు విసుగుకొనినైన యెఱుఁగరుకదా!

గంగన— మన పూర్వపుణ్యమువలన మనకు వారు గురువులుగ లభించిరి.

నారయ— వారి సద్గుణములే వారి కింతటి యున్నతస్థానము గల్గించినవి. వా రెక్కడకు వెళ్ళిన నక్కడే గౌరవము !

సింగన— ఆమాట సత్యమే సుమా! మొన్న చూచితిమిగదా! ఆ రాచకొండప్రభువు గురువుగారి కెంత గౌరవము చేసెనో!

గంగన— కాదు మఱి! "విద్వాన్ సర్వత్ర పూజ్యతే" ఆ దండకము వింటిరిగదా! ఆహా!

నారయ—ఓహో! ఏమి గంగాప్రవాహము. దండకము కాదది తెనుఁగుతల్లికి రత్నాల దండకడియము.

సింగన — ఆ మహాప్రభావునకో! మఱియొకనికి తపస్సు చేసినను ఆ శక్తి రాదు. ఆనాఁడు ఆ రత్నాలహారములు, ఆ మకరకుండలములు, ఆ సింహలలాటములు అలంకరించుకొని కవితాగోష్ఠిలో నగ్రపీఠమున నున్న ఆచార్యులు,అనురాజాచార్యులవలె ప్రకాశించిరి గాదా!

నారయ—ఆ భోగినీదండకకృతిసమర్పణోత్సవమునాఁటి ఆ సన్నివేశము చూడఁజూడ నుల్లము పొంగినది. అనుకొనకుండఁగనే యొక పద్యము కూడ వ్రాల్చినది.

సింగన — ఔరా! గట్టివాఁడవు. మేము ఆ సభ,అలంకారములు, నిలువుటద్దములు, రంగురంగుల చిత్తరువులు చూచుసరికి దిగ్భ్రమఁ జెంది యనిమిషుల మైపోతిమి. నీవు పద్యమునుగూడ వ్రాసితివా?

గంగన— పద్యమా! గురువుగారిపైన! ఏది? ఏది?

నారయ— ఇదిగో! వినుఁడు.

చిఱునవ్వు వెన్నెల సింగారములతోడ
బ్రహ్మతేజము వింతప్రభ దలిర్ప
మకరకుండలరత్నమంజురాగముతోడఁ
గాశ్మీరశాలువు గలిసి పోవ
సింహలలాటోగ్రసీత్కారములతోడఁ
గరనఖకాంతులు కయ్యమాడఁ

బసిఁడి మించిన మేనిపసదొంతరులతోడఁ
జందనచర్చలు జర్చసేయ
సహజగాంభీర్యసంపత్తిసరణితోడ
రాజగౌరభావంబు రాణ మెఱయ
విద్య రూపొంది యిమ్మాడ్కి వెడలె ననఁగ
గురుఁడు దీపించెఁ గవిగోష్ఠి గురుని మించి.

గంగన—(సంతోషముతో) దైవసాక్షి! కోడిగము కాదు. చాల బాగుగ నున్నది.

సింగ—ఇందతిశయోక్తి యేమాత్రము లేదు; అంతయుస్వభావోక్తి. నవ్వుచు) నీకిట్టి యలౌకికస్ఫురణ అప్పుడప్పుడు కలుగుచుండునురా!

నారయ—ఏమో! అంతయు గురువుగారి యనుగ్రహము.

సింగన—(అలికిడి విని) అరుగో! గురువుగారు, అనుష్ఠానము దీర్చుకొని వచ్చుచున్నారు. గ్రథంములు చూడుఁడు.(అందఱు గ్రంథములు చూచుచుందురు)

పోతన—(పూజాగృహమునుండి వచ్చుచు శాంతముతోఁగనులఱమోడ్చి)

"భగవద్గీతా కించి దధీతా। గంగాజలలవకణికాపీతా॥ భగవద్గీతా..."

ఆహా! అర్జును విషాదము నేమి, అఖిలమానవవిషాదమును దూరము గావించు దివ్యగాన మది. గీతాపారాయణము చేయుచున్నంతసేపు ఏదియోయొక ఆనందము గన్నెదుట సాక్షాత్కరించిన ట్లగును. హృదయము ప్రశాంత మగును. ఓ బాదరాయణమహర్షీ! నమోవాకములు. అష్టాదశపురాణములసంతరించినమహాకవివని కాదునిన్ను కొనియాడుట, ఆ యమృతాయమానములగు భగవత్సందేశములను, దపోబలమున సంగ్రహించి గీతరూపమునఁబ్రచారముగావించినమహానుభావుఁడవని. కావున నే, భాగవతుఁడవైభగవత్సామ్యమునుబడసితివి. "వ్యాసోనారాయణో హరిః" ధన్యుఁడవు. (నమస్కరించును.)

(కొంచెముసేపు అట్లుండి ముందుజూచి)అరుగో!పాపము!పిల్లలు,అప్పుడే పాఁతపాఠములు చింతనఁజేసికొని క్రొత్తపాఠములకై వేచియున్నారు. బుద్ధిమంతులు, శ్రిద్ధాళురు. (సమీపించును)

శిష్యులు——(లేచి కరములుమోడ్చి, సమస్కరించి వెనుకకు జరిగి వినయమున గురునిఁ జూచు చుందురు.)

పోతన——విద్యాప్రాప్తి రస్తు!

గంగన——(రత్నకంబళము దులిపి వేయును)

పోతన——(కూరుచుండి) కొండు! నిలుచుంటి రేల? కూరుచుండుఁడు.

శిష్యులు——(చిరిచాప పైమూఁడడుగులదూరమునఁగూరుచుందురు.)

పోతన——(శిష్యులఁజూచుచు) ఎందులకోగాని నేఁడు హఠాత్తుగ జ్ఞాపకమునకు వచ్చినది.ఏదీ!అశాకుంతల ములోని కణ్వాశ్రమవర్ణనము. చాలకాలమైనది కాఁబోలు! చదివి, ఎవరికైన జ్ఞాపక మున్నదా?

గంగన——చిత్తము లేకేమి? అంత్యాక్షరీపరీక్షలకొఱకు నేను శాకుంతల మంతయు బట్టి పట్టివేసితిని.

సింగ——ఔరా!మాకుఁజెప్ప నేలేదుగా.సరిలే!(అనిప్రేలుచూపును.)

పోతన——దొడ్డపని చేసితివి నాయనా! ఏదీ!చదువుము.

గంగన——చిత్తము.

"నీవారా శ్శుకగర్భకోటరముఖభ్రష్టా స్తరూణా మధః
ప్రస్నిగ్ధాః క్వచి దింగుదీఫలభిద స్సూచ్యంత ఏవోపలాః
విశ్వాసోపగమా దభిన్నగతయ శ్శబ్దం సహన్తే మృగాః
తోయాధారపథాశ్చ వల్కలశిఖానిష్యన్ద రేఖాఙ్కితాః"

పోతన——(కనులుమోడ్చి తలత్రిప్పుచు ఆనందించుచుండును.)

నారయ—— ఆపితి వేమి? మఱియొకటి యున్నదిగదా!

గంగన—— ఔను. ఇదిగో!

"కుల్యాంభోభిః పవనచపలై శ్శాఖినో ధౌతమూలాః
భిన్నో రాగః కిసలయరుచా మాజ్యధూమోద్గమేన
ఏతే చార్వా గుపవనభువి చ్ఛిన్నదర్భాఙ్కురాయామ్
నష్టాశఙ్కా హరిణశిశవో మందమందం చరన్తి."

పోతన— ఆహా! కాళిదాసునివాణి! సుధాధోరణి. ఆ రెండవ శ్లోకము మిక్కిలి గూఢార్థము గలిగియున్నది. "ధౌతమూలాః", "భిన్నరాగః", "నష్టాశఙ్కాః" జ్ఞాపకము చేయుఁడు. మఱియొక యదనున విపులముగఁ జెప్పెదను.

నారయ—చిత్తము. ఆంధ్రములో నింత అందముగఁ జెప్పినవారు లే రనుకొందును.

పోతన— నాయనా! అట్లనరాదు. ఆంధ్రమహాభారతముఁ జదివియుంటిరిగదా!

సింగన— ఆఁ! ఆఁ! భారతమున!

పోతన— జ్ఞాపక మున్నదా? చదువుము.

సింగన— చిత్తము.

"శ్రవణసుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువు తగిలి
కదలక వినుచుండు గరులును, గరికర
శీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు
కణములఁ జల్లనిగా డ్పాసపడి వానిఁ
జెంది సుఖంబున్న సింహములును
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టు నీవారాన్నపిండతతులు
గడఁగి భక్షింప నొక్కటఁ గలసి యాడు
చున్న ఎలుకలుఁ, బిల్లులు నొందు సహజ
వైరివర్గంబులకు సహవాస మపుడు
సూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమంది."

పోతన — ఇంతకుఁ బైనుండియే ఆశ్రమవర్ణనము ప్రారంభ మైనది. ఆహా! ఆ వాగనుశాసనుల వాక్యమాత్రము సామాన్యమైనదా? పై కాళిదాసు వర్ణనముల కిందుఁ జిన్నెలు వన్నెలు కల్పించినారు. మన నన్నయగారు వైదికాగ్రేసరులు. ఇట్టి ఘట్టము లనిన ఆ యవిరళజప హోమతత్పరునకు ఉత్సాహము మెండు.

నారయ — స్వామీ! కాళిదాసు కణ్వమహర్షిని "కులపతి" యనునే! ఏ కులమునకుఁ బతి?

పోతన — (చిఱునగవుతో) చక్కని ప్రశ్నము. కులప్రవర్తకుఁడైన ఋషిగావున "కులపతి". అంతియకాక. ఏముని నిత్యము పదివేల మందికి మజ్జనభోజనాది సౌకర్యములఁ జేకూర్చి, యధ్యయనము చేయించునో ఆతని 'కులపతి' యందురని పెద్దలు చెప్పఁగ వింటిని.

నారయ — అబ్బా! పదివేలమందికి భోజనాదిక సౌకర్యము లిచ్చి చదువే! అట్లయిన ఆ ఆశ్రమ మొక పెద్దపాఠశాల యనినమాట?

పోతన — ఆశ్చర్యమేమి? నాయనా! ఆయాశ్రమములందు సాంగముగ వేదములు, వేదాంతములు, దర్శనములేగాక ఐహికోపయుక్తములగు, ఆయుర్వేద, ధనుర్వేదములును, సనిదర్శనముగ బోధించుచుండెడివారు. ఆశ్రమములు సర్వకళాశాలలై వెలసెడివి. నిష్కాములును, సర్వజ్ఞులును అగు ఋషులు బోధకులు! ధర్మరక్షాదీక్షితులగు భూపాలురు సహాయకులు! ఇఁక అసాధ్యమేమున్నది? అది భారతదేశ చరిత్రమున స్వర్ణయుగము. గడచిపోయినది. గడచిపోయినది!... (నిముసము కనులు మూసి భావించును.)

నారయ — ఇప్పటికిని భగవదనుగ్రహమువలన అట్టివానికిఁ గొఱంత లేదనుకొందును.

పోతన — ఇప్పుడా! ఇప్పటి పరిస్థితులు వేరు. (చేయి విదల్చును.)

నార — తమ రట్లు సెలవిచ్చినచో మనవి చేయలేము. కాని, సాక్షాత్తుగఁ దమబోఁటి మహానుభావులను నిత్యము సేవించుచు, మొన్న

మొన్న రాచకొండ రాచనగరులో జరిగిన కృతిసమర్పణమహోత్సవమును గనులార్ఁ గాంచిన మేముమాత్రము ఇవియు సుదినములే యని తలంచుచున్నాము.

సింగన— ఆహా! ఏమి ఆ ప్రభువరేణ్యుని విద్యాభిమానము!

పోతన— (మెల్లఁగ) విద్యాభిమానము! కాదు, స్వాభిమానము. లోకవంచన. అబ్బ! ప్రభూ‌పిశాచమువలె ఈ పరిసంగము ఏందుఁ జూచిన అందుఁ బ్రత్యక్ష మగుచున్నదే! మఱతుమన్నను మఱపునకు రానీదు దీలోకము. అదిజీవితమున నొక విషాదఘట్టము. (ప్రకాశముగా) నాయనలారా! ప్రొద్దెక్కినది. మీపాఠము నుపక్రమింపుఁడు.

పోతన-- (నెమ్మదిగా)
శిష్యులు-- (బిగ్గఱగా)
"సహనావవతు। సహనౌభునక్తు! సహవీర్యం కరవావహై। తేజస్వినావధీత మస్తు మా విద్విషావహై" ॥ ఓం శాంతిః శాంతిః శాంతిః

"జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే"
శ్రీగురు చరణారవిందాభ్యాంనమః

సింగ— అర్జున ఉవాచ.

"స్థితప్రజ్ఞస్య కా భాషా? సమాధిస్థస్య కేశవ।
స్థితధీః కిం ప్రభాషేత? కిమాసీత? వ్రజేత కిమ్?

పోతన— ఓహో! ద్వితీయాధ్యాయములో నుంటిమి కాఁబోలు! మంచిది. ఈ శ్లోకమున అర్జునుఁడు స్థితప్రజ్ఞుని లక్షణ మేమని భగవంతుని బ్రశ్నించుచున్నాఁడు.

నారయ
గంగన
చిత్రము. చిత్రము. శ్లోకార్థము సుగమము లెండు. భాష్యముచదువమా! పైగ్రంథమా?

సింగన—(అడ్డుతగిలి) ఆఁగుఁడు! స్వామీ! ఈప్రశ్న అర్జునుఁడు ఎందులకు వేసెనో తెలిసినదికాదు.

పోతన— ఓహో! ఈప్రశ్న బీజ మేమనియా నీజిజ్ఞాస? మోమోట పడకుము. అడుగుము.

సింగన— చిత్తము.

పోతన—వినుఁడు.

"శ్రుతివిప్రపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి"

అనికదా దీనికిఁ బూర్వశ్లోకము!

సింగన—చిత్తము.

పోతన— అందు "యోగ మవాప్స్యసి" యనుటకు నిన్న ఏమని యర్థము చెప్పితిని?

సింగన—'యోగ మవాప్స్యసి', "యోగం అవాప్స్యసి" (ఆకాశమును జూచుచు నాలోచించుచుండును.)

పోతన—(నారయను జూచి) నీవు?

నారయ— ఆఁ! "ఆత్మవివేకప్రజ్ఞను సమాధిని పొందుదువు" అని సెలవిచ్చినారు.

పోతన— అవునుగదా! ఆ "ఆత్మవివేకప్రజ్ఞ-సమాధి' అన నేమియో తెలియక అర్జునుఁడు భగవంతుని స్థితప్రజ్ఞుని లక్షణమును అడుగుచున్నాడు. ఇది ప్రశ్నబీజము- తెలిసినదా!

సింగన—చిత్తము. ఇపుడు స్పష్టముగఁ దెలిసినది.

పోతన—ఇఁక "జహాతి యదా కామాన్" నుండి ఈయధ్యాయము ముగియునఁటఁకు బైప్రశ్నకు భగవంతుని సమాధానము. ఈ శ్లోకములు బాగుగ జ్ఞాపక ముంచుకొనవలసినవి. చదువుఁడు.

వృద్ధబ్రాహ్మణుఁడు—(వీధిలో గుమ్మముదగ్గఱనుండి వడఁకుచు, "హరేరామ హరేరామ రామరామ హరేహరే" ఇదేనా నాయనా! ఆ పుణ్యాత్ముఁడు పోతన్నగారి యిల్లు?

పోతన——(విని) ఆఁగుము. ఎవరో వీథిలోనుండి పిలుచుచున్నట్లున్నారు చూడుము.

నారయ——(చూచి)అదిగో! ఒక వృద్ధబ్రాహ్మణుఁడు, ఇద్దఱుపిల్లలు వచ్చుచున్నారు

పోతన——నేడు ప్రొద్దెక్కి మొదలు పెట్టితిమి. ఇంతలోనో నాపివేయుఁడు. తేపు చదువుకొనవచ్చును పాపము వృద్ధు! కనుగొందము.

శిష్యులు——చిత్తము. శ్రీహయగ్రీవాయనమః, శ్రీగురుచరణారవిందాభ్యాంనమః ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః(పుస్తకములుమూసి నిలువఁ బడుదురు.)

బ్రాహ్మణుఁడు—— నాయనలారా! చూడుఁడు. ఆ పుణ్యాత్ముఁడున్నాఁడేమో! (కనుబొమ్మలపైఁ జేయిపెట్టి వంగి చూచుచు) కన్నానదు. పెద్దతనము.

పోతన—— దయచేయుఁడు. దయచేయుఁడు. నారయా! కైదండనిచ్చి తీసికొనిరమ్ము. పాపము! (నారయ కైదండనీయవృద్ధు వచ్చి అరుగుమీఁదఁ జతికిలబడును.)

బ్రాహ్మణుఁడు—— (ఒగర్పుతో)ఊస్. ఊస్. రామచంద్రా! ఏడీ ఆ పోతన్న మహారాజు?

పోతన——(దరియఁజేరి చేతులు మోడ్చి)నమస్కారము.కొంచెము నేపు సేద దేరుఁడు. ఎండ తగిలినట్లున్నది. పెద్దలు!

శిష్యులు—— తాతగారికి నమస్కారము.

బ్రాహ్మణుఁడు—— వేయేండ్లు వర్ధిల్లుఁడు. వేయేండ్లు వర్ధిల్లుఁడు. (పోతన్నను జూచి) నీవేనా నాతండ్రీ పోతరాజువు?

పోతన—— చిత్తము. నన్నే పోతన అందురు. ఈ పిల్లలు తమ పిల్లలేనా? ఏమి చదువుకొనుచున్నారు?

బ్రాహ్మణుఁడు—— ( పిల్లలను దలపై నిమురుచు ) అయ్యో!

నాయనా! ఏమిచెప్పుదును? తలంచుకొనిన గుండె నీరయిపోవుచున్నది. [వెక్కి వెక్కి యేడ్చును.]

పోతన— అయ్యో! పాపము. ఏమికష్టమో కదా! కదలించి తమ్ము దుఃఖపెట్టితిని. క్షమింపుఁడు.

బ్రాహ్మణుఁడు— నాయనా! నావిధికి ఎవ రేమి చేయఁగలరు? ఇటు వినుము. ఈ కసికందులు నా మనుమలు. ఈ పిల్లలతండ్రి (ఆయాసముతో) అయ్యో! నాతండ్రీ! నా చెట్టంత కొడుకు! ఏమి చెప్పను? (కన్నులనీరు తుడిచికొనుచు) మొన్న మూడేండ్లనాఁడు, ఆ పాడు విషజ్వరముల వాఁతఁ బడిపోయినాఁడు. నా అండ పడిపోయినది. నా యాశ లడుగంటినవి. (దుఃఖించును. పిల్లలు తాతనుజూచి దుఃఖింతురు.)

శిష్యులు— చిన్నపిల్లలు, పాపము! చదువుకొను ఈడు.

పోతన— పెద్దలు, తమకుఁ జెప్పనంతటివాఁడను కాను. చావు పుట్టుకలు సర్వేశ్వరాధీనములు.

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ।
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి॥

అనికదా! భగవద్వాక్యము. దుఃఖపడి ప్రయోజనము లేదు!

బ్రాహ్మణుఁడు—దుఃఖమా నాయనా! అన్నియుఁ దిగమ్రింగితిని. ఆపాడువిషజ్వరము నన్ను తన పొట్టను బెట్టుకొనియున్నచో నాకీ కడగండ్లు దొలఁగియుండెడివే యని వాపోవుచున్నాను. అయ్యో! అల్లెందుల కగును? "పాపీ చిరాయుః"......

పోతన — కష్టసుఖములు కావడికుండలు. చీఁకటిరాత్రిలు మాత్రము స్థిరముగనుండునా? భగవదనుగ్రహమువలనదుఃఖములును దొలఁగిపోవును.

బ్రాహ్మణుఁడు— నీబోఁటిపుణ్యాత్ముని జూడఁగనే దుఃఖములు తొలఁగిపోయినవి. నిన్నుజూచినంత మాపిల్లవానిని జూచినట్లు కడుపు నిండినది. నీవలె వాఁడును శాంతమూర్తి నాయనా!

పోతన— ఈపిల్లలకు ఉపనయన మైనదా? ఎనిమిదేండ్లుండవచ్చు ననుకొందును.

బ్రాహ్మణుఁడు— అవునునాయనా! ఈచిన్నవానికి ఎనిమిదవ సంవత్సరము వచ్చినది ఈ మాఘపూర్ణిమకు. పెద్దవాఁడు వీనికంటె ఒకఏడు పెద్ద. అయ్యో! రామా! ఉపనయనములా? ఏమి చెప్పుదును! చెప్పినసిగ్గు; చెప్పకుండుటయు లగ్గు కాదు. తరతరములనుండియు వైదిక కుటుంబము. మాతాత సోమయాజి నాయనా! "గర్భాష్టమే బ్రాహ్మణ ముపనయీత", "తమధ్యాపయీత" అని ధర్మదేవత శాసించుచున్నది. తెలియును. కాని ఏమి లాభము! ఆ వడకపోగు వేయలేకపోయితిని. నలుగురిలోఁ దలవంపులు. (తలవంచుకొని దుఃఖించును.)

పోతన— భదవదనుగ్రహమున్నచో నన్నియుఁ జేకూరును. లజ్జ పడకుఁడు. గడిచి బ్రతికిన వారెవరు? ఇది మీస్వగృహము. ఈ బాలుర యుపనయనములు, మంచి ముహూర్తము చూచి వైభవముగా తొందఱలోఁ జేయుదము. పిమ్మట ఈ పిల్లలతోఁ బాటుఇక్కడే చదువు కొనెదరు.

బ్రాహ్మణుఁడు— (పట్టరాని సంతోషముతో) అమ్మయ్య! నా ఆయువునుగూడ పోసికొని వేయేండ్లు వర్ధిల్లుము. ధర్మదేవత నీకు అండ యై నిలుచుగాక. నాయనోఱు శకునములు ఊరకపోవుసుమా! వారు వీరు చెప్పుకొనఁగా విని, ఏనాఁటికైనను నాకష్టములు గట్టెక్కునా యని, మొన్న ఈటెక్కలురాని పక్షులను వెంటఁబెట్టుకొని, నిన్నుఁ జూడవలెనని గంపెడంత యాశతో బయలుదేరి వీధిగుమ్మములోనికి వచ్చుసరికి, ఆహా! యేమిచెప్పను? ఆగరుడవాహనముమీద భూనీళలతో నారాయణమూర్తి, మాయూరికేశవస్వామి ఊరేఁగుచు ఎదురైనాఁడు. చేతులెత్తి నమస్కారములు చేసి ప్రయాణము సాగించితిని. ఆ యనాథరక్షకుఁడే, ఆ యాపద్బాంధవుఁడే నీహృదయములోఁ బ్రవేశించి ఈచల్లని మాటలు పలికించినాఁడు. (అని పైకిఁ జేతులెత్తి భగవంతునకు నమస్కరించును)

పోతన— తమరు భక్తులు; ఆతఁడు భక్తవత్సలుఁడు. ఇఁక కొదువ యేమున్నది?

("ఇంటిలోనుండి 'వంట అయినది' అతిథులతో గూడ మడి కట్టుకొన వచ్చును")

పోతన— గంగనా! ప్రాఁతయింటిలో ననుష్ఠానములఁ దీర్చికొను చుండు అతిథులను వెంటబెట్టుకొనిరమ్ము. (వృద్ధునిఁజూచి) వంట అయినదఁట. లోనికిదయచేయుఁడు. నేఁడు మికి్కలి సుదినము. పెద్దలు! అనుష్ఠానము దీర్చికొన్నచో భోజనము చేయవచ్చును. (నారయఁ జూచి) నారయా! పాపము. ఈపిల్లలకుఁ గ్రొత్త. మీ వెంటనిడుకొని అలవాటు చేసికొనుఁడు. లెండు! మీరుకూడ మడికట్టుకొనుఁడు.

శిష్యులు— చిత్తము. చిత్తము.

బ్రాహ్మణుఁడు— నాకు నిన్నుఁ జూచినపుడే కడుపు నిండిపోయినది ! మంచిది (లేచి) ఎటు నాయనా ?

పోతన— ఇటు దయచేయుఁడు. ఇటు గడప జాగ్రత!

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

---

## తృతీయ రంగము – పేరావధానియిల్లు

(పేరావధాని వీధియరుగుపై కూరుచుండి కూనిగా గాలం తీయుచుండును. వెంకటరెడ్డి తల వంచుకొని తొందఱగఁ బోవుచుండును )

పేరావధాని— ఇదిగో ! ముఖం తప్పించుకొని పోతున్నావేఁ ! వెంకటరెడ్డీ! ఎక్కడికీ ఆ తొందఱ ?

వెంకటరెడ్డి— తెమరా! చూళ్లేదండి, దండాలు. (పోఁబోవును.)

పేరావధాని— ఓయ్! నీయిల్లు బంగారంగాను! కొంచెం నిలు ! ఈమధ్య కనబడటం లేదేఁ! గ్రామంలో లేవా?

వెంకటరెడ్డి— (అడుగులు వేయుచు) లేకేఁ! ఉన్నా!

పేరావధాని— ఆఁ హాఁ! గ్రామంలో ఉండికూడా కనపట్టంలేదన్న మాట! ఏమిా! తీరిక లేదా? భోజనం చేసి గచ్చచావడి చేరినవాడివి తాళ్లు తిగి, పిట్టలు వొదలు పట్టినాగాని లేచేవాడివికావే! ఆ పులిజూదా లేమయ్యె! ఆ వ్యవహారా లేమయ్యె? నిజంగా నీవు లేనందువల్ల నాకే తోచటం లేదే! నీ కెట్లా ప్రొద్దు పోతున్నదో?

వెంకటరెడ్డి— పొద్దా? పొద్దుకేఁ! బంగారమల్లే జరిగిపోతావుంది! (పోఁబోవును.)

పేరావధాని— ఇదిగో! అడిగిందానికి సమాధానం చెప్పక ఎక్కడికా పరుగు? ఏఁ! బూర్లెమూఁకుడు బోర్లపడిందా?

వెంకట— పోనీయండి! పొద్దెటూలింది. ఈపాటికే మొదలెట్టి చదువుతూ ఉంటారు. అదిగో కోమటి సుబ్బయ్యకూడా పోతున్నాడు.

సుబ్బయ్య— ఇంకా ఇక్కడే నిలబడ్డారేఁ? (పోఁబోవును.)

పేరావధాని— సుబ్బయ్యా! అంతా క్షేమమా? ఎందాకా?

సుబ్బయ్య— అవధాన్లుగారా! నమస్కారాలు. నమస్కారాలు. ఇక్కడ నుంచుంటే ఏం లాభం? పోదాం రండి.

పేరావధాని—ఓయి నీయిల్లు బంగారంగాను! నుంచుంటేలాభం, కూర్చుంటే లాభఁ లెక్కపెడితే మేమూ లక్షాధికారులం అయ్యే ఉందుము!

సుబ్బయ్య— అవిటికేమిలెండి! లచ్చలు, చపలాలు, చంచలాలూ! ఏం ఎంకటరెడ్డన్నా? ఇవ్వా డీచేతిలో, అప్పు డాచేతిలో. (అని పెదవి విఱచును.)

వెంకటరెడ్డి— నిజమే. అంతా మాయేగా!

పేరావధాని— ఓహో! ఆ పాతసుబ్బయ్యవేనా? ఈ మెట్ట వేదాంతం ఏ కోస్తావ్యాపారంలో సంపాదించావు?

సుబ్బయ్య—(పెదవివిఱచి) ఏంయాపారాలోపోనీయండి. కొనేవాఁడెవఁడో? అమ్మేవాఁడెవఁడో? అంతా ఇదో నాటకం. ఈ వేళ ఇందు; రేపు అందు. (వెంకటరెడ్డిని జూచి) అంతేగా అన్నా!

వెంకటరెడ్డి—నిచ్చయం, నిచ్చయం. నిన్ననేగా ఆమూరాజు చెలవిచ్చింది.

సుబ్బయ్య—ఓ! ఏంకమ్మగా చెపుతారు? రెడ్డిగమేసుకొనికూచుంటే ఇంటిమీద బుద్ధిపోనేపోదు. ఏంరుచి, అరటిపండు వొలిచి అరిచేతిలో పెట్టినట్టే; ఏం? కాదూ! అన్నయ్యా!

వెంకటరెడ్డి—నన్నడిగితే, మొదట ఆ కూచోటంసుద్దీ ఇంకోడికి రాదంట. అవాలకం, ఆనెమ్మతి! ఓ!

పేరావధాని—(ముఖము చిట్లించి) ముఖ్యవిషయం చెప్పకుండానే! ఇంతకు ఎక్కడికీ మీ యీ ప్రయాణం ?

సుబ్బయ్య—అయితే! అవదాన్లుగారూ! అనకూడదు కానీ; మీరూ బ్రాహ్మలేగదా! ఎల్లేవాళ్లని నుంచోబెట్టి 'ఎక్కడికీ' అని అడగొచ్చా?

పేరావధాని—ఎహె హె! ఇందుకా మీరు ముఖం తప్పించుకొని పోవటం? దీనిలో ముంచుకొనిపోయే మహాకార్యమేమున్నదీ?

సుబ్బయ్య—అవును! తమకేం! నాకు బ్రతికున్నంత కాలం ఈ డొక్కలో ఈశరాయంత మెదలుతూనే ఉండగలదు ఆనాటి సంగతి.

వెంకటరెడ్డి—ఏంజరిగిందయ్యా! చేబదులుతీసుకోని ముంచేశాడా ఈ బాపనాయన?

పేరావధాని—(తొందఱతో) చెప్పు! నాకేమీ జ్ఞాపకం లేదు. ఏం జరిగిందో?

సుబ్బయ్య—ఏంచెప్పేదీ! అద్దాన్నం. పదేళ్లమాట. అప్పటికీ, ఇప్పటికీ, ఈ యరుగుమీదే తీరుబడిగా కూచోని వచ్చేపోయేవాళ్లని 'ఎక్కడికీ', 'ఎక్కడికీ' అంటు అడగటమేగా మీకబ్యాసం, అవునా కాదా?

పేరావధాని— ఆఁ హాఁ! గ్రామంలో ఉండికూడా కనపట్టంలేదన్న మాట! ఏమీ! తీరిక లేదా? భోజనం చేసి రచ్చచావడి చేరినవాడివి కాళ్ల తిగి, పిల్లలు [illegible]దలు పట్టినాగాని లేచేవాడివికావే! ఆ పులిజూదా లేమయ్యె! ఆ వ్యవహారా లేమయ్యె? నిజంగా నీవు లేనందువల్ల నాకే తోచటం లేదే! నీ కెట్లా ప్రొద్దు పోతున్నదో?

వెంకటరెడ్డి— పొద్దా? పొద్దుకేఁ! బంగారమల్లే జరిగిపోతావుంది! (పోఁబోవును.)

పేరావధాని— ఇదిగో! అడిగిందానికి సమాధానం చెప్పక ఎక్కడికా పరుగు? ఏఁ! బూర్లెమూఁకుడు బోర్లపడిందా?

వెంకట— పోనీయండి! పొద్దేటాలింది. ఈపాటికే మొదలెట్టి చదువుతూ ఉంటారు. అదిగో కోమటి సుబ్బయ్యకూడా పోతున్నాడు.

సుబ్బయ్య— ఇంకా ఇక్కడే నిలబడ్డారేఁ? (పోఁబోవును.)

పేరావధాని— సుబ్బయ్యా! అంతా క్షేమమా? ఎందాకా?

సుబ్బయ్య— అవదాన్లుగారా! నమస్కారాలు. నమస్కారాలు. ఇక్కడ నుంచుంటే ఏం లాబం? పోదాం రండి.

పేరావధాని—ఓయి నీయిల్లు బంగారంగాను! నుంచుంటేలాభం, కూర్చుంటే లాభం లెక్కపెడితే మేమూ లక్షాధికారులం అయ్యే ఉందుము!

సుబ్బయ్య— అవిటికేమిలెండి! లచ్చులు, చపలాలు, చంచలాలూ! ఏం ఎంకటరెడ్డన్నా? ఇప్పు డీచేతిలో, అప్పు డాచేతిలో. (అని పెదవి విఱచును.)

వెంకటరెడ్డి— నిజమే. అంతా మాయేగా!

పేరావధాని— ఓహో! ఆ పాతసుబ్బయ్యవేనా? ఈ మెట్ట వేదాంతం ఏ కోస్తా వ్యాపారంలో సంపాదించావు?

సుబ్బయ్య — (పెదవివిఱిచి) ఏం యాపారాలో పోనీయండి. కొనేవాఁ డెవఁడో! అమ్మేవాఁ డెవఁడో? అంతా ఇదో నాటకం. ఈ వేళ ఇందు; రేపు అందు. (వెంకటరెడ్డిని జూచి) అంతేగా అన్నా!

వెంకటరెడ్డి — నిచ్చయం, నిచ్చయం. నిన్ననేగా ఆమూరాజు చెలవిచ్చింది.

సుబ్బయ్య — ఓ! ఏంకమ్మగా చెపుతారు? రెడ్డిగ మేనుకొనికూచుంటే ఇంటిమీద బుద్ధిపోనేపోదు. ఏంసుచి, అరటిపండు వొలిచి అరిచేతిలో పెట్టినట్టే; ఏం? కాదూ! అన్నయ్యా!

వెంకటరెడ్డి — నన్నడిగితే, మొఖట ఆ కూచోటంసుద్ది ఇంకోడికి రాదంట. అవాలకం, ఆనెమ్మతి! ఓ!

పేరావధాని — (ముఖము చిట్లించి) ముఖ్యవిషయం చెప్పకుండానే! ఇంతకు ఎక్కడికీ మీ యీ ప్రయాణం?

సుబ్బయ్య — అయితే! అవదాన్లుగారూ! అనకూడదుకానీ; మీరూ బ్రాహ్మలేగదా! ఎల్లేవాళ్లని నుంచోబెట్టి 'ఎక్కడికీ' అని అడగొచ్చా?

పేరావధాని — ఎహెహె! ఇందుకా మీరు ముఖం తప్పించుకొని పోవటం? దీనిలో ముంచుకొనిపోయే మహాకార్య మేమున్నదీ?

సుబ్బయ్య — అవును! తమకేం! నాకు బ్రతికున్నంత కాలం ఈ డొక్కలో ఈశరాయంత మెదలుతూనే ఉండగలదు ఆనాటి సంగతి.

వెంకటరెడ్డి — ఏంజరిగిందయ్యా! చేబదులుతీసుకోని ముంచేశాడా ఈ బాపనాయన?

పేరావధాని — (తొందఱతో) చెప్పు! నాకేమీ జ్ఞాపకం లేదు. ఏం జరిగిందో?

సుబ్బయ్య — ఏంచెప్పేదీ! అద్దాన్నం. పదేళ్లమాట. అప్పటికీ, ఇప్పటికీ, ఈ యరుగుమీదే తీరుబడిగా కూచోని వచ్చేపోయేవాళ్లని 'ఎక్కడికీ', 'ఎక్కడికీ' అంటు అడగటమేగా మీకబ్యాసం, అవునాకాదా,

పేరావధాని——ఔను! అయితే? అడగకపోతే ఎక్కడేమివిశేషాలు జరుగఁగలవో తెలిసేదెట్లా? అయినా దానితో ఎవరికేమినష్టమున్నా; (పొడుముపట్టు గట్టిగా ఎక్కించి ఘాటుగా చూచును.)

సుబ్బయ్య——(తొందఱతో) ఎవరికేన్నష్టమా? ఇంకా దాపరిక మెందుకూ. ఇనండి! (వెంకటరెడ్డినిజూచి) అన్నయ్యా! నేనూ, లాబాల మీద లాబాలుగా ఉన్నాయని మా బావమరిది చెప్పితే యిని, కాని యిచ్చి కందాయాల్లో చూపించుకోని సుబమా అని సంచి రూపాయలు పట్టుకోని దూదియాపారం చేద్దామని ఓరుగల్లుసంతకు పయానమైనా. (పేరావధానిని జూచి) ఔనా?

పేరావధాని—— (విసుగుతో) ఏమో! నాకేమీ జ్ఞాపకం లేదు. అయితే అయీవుండవచ్చు. కోమటి బేరాని కెళ్లక యేం జేస్తాడు?

వెంకటరెడ్డి—— ఏం జరిగిందో యెళ్లబెట్టూ!

సుబ్బయ్య——ఏంజరిగిందా! ఆయాళా ఈ దేము డిక్కడే ప్రచ్చత్తమై "సుబ్బయ్యా! ఎక్కడికెడుతున్నా!" అని ఎదురుగుండా వచ్చి నోటి వెంటా అడిగాడు.

పేరావధాని—— (నవ్వుచు) నీవు చెప్పేదే ఒక కథవలె వుంది.

సుబ్బయ్య—— కదే! మీకేం! మాకద అయింది.

వెంకటరెడ్డి—— ఏమయిందో ముగించు పోదాం.

సుబ్బయ్య—— ఎబ్బే! మనం ముగించేదేముందీ? అంతా ఆళ్లే ముగించారు. ఇను! ఊరు దాటుదునుగదా! మొగులుపట్టి ఉండ్రాళ్లంత వడగళ్లు, వానా, గాలీ, అడుగు తీస్తే అడుగు పడదు. దేముఁడా అంటూ నోర్లుకుంటూ పోయినా. ఏం లాబం? ఓరుగల్లుకి ఓ పరుగుంది దనగా చీకటి పడింది. (భయముతో) అయ్యబాబోయ్యా! తలుచుకుంటే గుండె లటుకుట్టు మంటోంది. ఇంకేముంది. ఇంత లావు కఱ్ఱలు పట్టుకోని ఇద్దఱు! యమబటులే, ఎలకలాళ్లు ఎదురైనారు. తెలివిగలవాణ్ణి కాబట్టి

దెబ్బ పడకముందే ముల్లె చేతికిచ్చా' మంచివాళ్లు మాట తీసుకోని ముందుకు వొదిలారు. ఈయన్ని తలుచుకొంటూ, పైసలేదు కాబట్టి బయమూ లేకుండా ఒట్టిచేతుల్తో ఓరుగల్లు చేరుకున్నా.

వెంకటరెడ్డి—— అబ్బా! ఎయ్యి రూపాయలే! పాపం పెద్ద దెబ్బే; అయినా ఈ ఫేరావదాండ్లుగారికి ఏరే పని లేదు. పిల్లిమీద ఎల్లి, ఎల్లిమీద పిల్లి అంటే చెవులు కోసుకుంటాడు.

సుబ్బయ్య—— ఒట్టెట్టుకున్నా! అమ్మతోడు! ఆనాడు మొదలుకోని ఈ దారిని నడవడమే మానేశా! ఈయేళ కొంచెం ఆలశ్యం అయితే దగ్గిఱ దారిగదా అని ఈ యీదిని బయలుదేరితే తగిన శాస్తి అవనే అయింది.

వెంకటరెడ్డి——అనగూడదు గానీ, ఈయనా బాపనాయనే గందా! ఏదో! ఆరికి మల్లేనే ఇంత పురాండ్థం అదీ ఎప్పుడన్నా యినిపించారూ! అందుకనే ఆ పోతరాజుగారికీ, మన పెద్దదొఱగారు ఈ నడుమ; అయ్యోంటి, ఆ చెవులకి తగిలించేవి. ఆఁ! ఆఁ! మకరకుంటరాలు, ఆరాలు ఎన్నో యిచ్చారంట. (బింకముగా పేరావధానినిఁ జూచును.)

సుబ్బయ్య—— చేసుకొన్న వారికిఁ జేసుకున్నంత, చిన్న బేరం చేసి పెద్ద లాబం రమ్మంటే ఎట్టా? (పేరావధానినిఁ జూచును.)

పేరావధాని—— చాలు. చాలు, చివఱకు ధర్మపన్నాలలోకి దిగిందీ వ్యవహారం? (చేతులు త్రిప్పుచు) ఈ రాజగౌరవాలూ, అవీ మాకేమీ క్రొత్తవి కావు. మా మాన్యాలు ఏడుతరాలనాటివి. తెలుసా! మా ముత్తాత "జ్యోతిష మార్తాండ" వెంకటరామసోమయాజులవారికి పగటిదివిటీ లుండేవఁట! మాది ఆ పోతన్నకువలె "నడుమంత్రపు సిరి" గాదు. (మరి కొంచెము సాగఁదీయుచు) "మధ్యవైష్ణవానికి నామాలు మెం" డని ఆతిగాని కిప్పుడు పట్టపగ్గాలు లేకున్నవి. ముందు ముందు మీకే తెలుస్తుందిలే! పోండి 

సుబ్బయ్య— మాకు తెలియనే తెలిసిందిగాని, అవధాన్లుగారూ! రేపు పోతరాజుగారింట్లో ఆపిల్లఁడి ఒడుగుగదా! తమరేనా పసిబిడ్డలు!

పేరావధాని— (విసుగుతో, పసిపిల్లలా! వాల్మీకులా! (కోపంతో) కాదు! ఆతని పాలిటికి విశ్వామిత్రుఁడనే!

సుబ్బయ్య— (నవ్వుచు) ఎహెహె! తమరు నిజంగా విశ్వామిత్రులేనండి!

వెంకటరెడ్డి— నిజమే! రేపు, రేపే! మఱచిపోయినా! సమారాధనకి పాలూ, పెరుగూ పోగుచేసి యిద్దామనుకొన్నా!

సుబ్బయ్య— చెప్పొద్దూ! నేయ్యో! నెయ్యి, రెండుకడవలు నావంతన్నా! పోతన్నగారు వద్దంటే వద్దన్నారు. కష్టంమీద ఒప్పించా. బీదపిల్లలంట! పాపం! ఆమారాజు అన్నీ భరిస్తూ, వైభోగంగా ఒడుగు చేస్తుంటే ఏదో ఉడతాభక్తిగా మనంకూడా ఓ చెయ్యేద్దామనిపించింది.

వెంకటరెడ్డి— నిజమే, ఏంకట్టుకుపోతాం! సరే! ఇప్పటికే పొద్దోయింది. పోయి నాలుగు మంచిమాట లిందాం రా! పోదాం (ఇద్దఱు తొందఱగా నడచిపోవుదురు.)

పేరావధాని— (దిగాలపడి) పూర్వం నాదగ్గఱకు వచ్చేవాళ్ళెవ్వరూ రావడం లేదు. ఇస్! అబ్బ! అలవాటుప్రకారం అయిదారుగురైనా చుట్టుపక్కల ఉంటేనేగాని నాకు పొద్దుపోదు. (కోపముతో) ఆపోతన్న! ఆపేరువింటేనే ఒళ్లుమంట. మాయలమారి, ఏమిమందు చల్లాడోగాని ఊరంతా ఒక్కటే గొఱ్ఱెదాటు. రామ రామ!! ఎవరిని కదలించినా, ఇదిగో! ఇదేధోరణి. ఈకోమటి సుబ్బయ్య! అబ్బా మూడులక్షలు మూలమూలుగుతున్నా ముష్టి విదలించని ధర్మమూర్తి! ఎహెహె! (నవ్వుచు) తనంతటతాను రెండుకడవలు నెయ్యి ఒడుగుకని ఒప్పుకొన్నాఁడఁట. ఔరా! త్యాగము. కాలం ఏం గానున్నదో? ఇఁక ఈవెంకటరెడ్డి? గ్రామంలో సగం కలహాలకు కారకుఁడై రచ్చకెక్కి రాటుదేలినవాఁడే! ఏమి శాంతం! ఏమి వేదాంతం! ఏమిమార్పు!

ఊఁ! దీనికి ఏమి ప్రతిక్రియ చేయాలి చెప్పుమా? (ఆలోచించి, తల యూపి) ఆఁ!ఆఁ! దొఱికింది, దొఱికింది. (సంతోషముతో) అహాహా! చాకచక్యములో చాణక్యుఁడంతటి నాకు- వక్రాలోచనలలో శుక్రాచార్యులకు పై చేయినవిపించుకొనిన నాకు-ఆలోచనలకు అరుదా? ఆఁ! ఈపతకము పారవచ్చు. ఆ ఆస్థానకవి మిక్కిలి మంచివాఁడు. ప్రభువు ప్రాపకమున్నవాఁడూ. మొన్న నెలిగందల సప్తాహంలోకదలించిచూచాగా! పోతన్న మాటెత్తగనే బుస్సుమని బుసగొట్టి తాండవం చేశాడు! మఱి రెండుసమిథలు మంత్రించి వేస్తా. దీనితో ఈ పోతన్న ధర్మాలూ, దానాలూ, పురాణాలూ, వదలి మకరకుండలాలు ఊడి "అమ్మో బువ్వ", "అయ్యో బువ్వ" అనే గతి పట్టకపోతే చూస్తాను! (పండ్లు కొఱుకుచు)

తెలివి తేటలు గల్గియు దేబెబోలె
రాజులం ద్గ గూర్చుండు కర్మ మేమి?
పోతనో! గీతనో! వీని పొగ రణంచి
పేరు నిల్పెద నందఱు భేషనంగ.

(తొందఱగా వెళ్లిపోవును.)

తెఱ వ్రాలును.

ద్వితీయాంకము సమాప్తము





# హాలికుఁడు

## తృతీయాంకము

(ప్రథమరంగము. బమ్మెర గ్రామమునకు వెలుపల చిట్టడవిని ఒక వాగుదరి గుట్ట)

చిదానందయోగి—పద్యము చదువుచు ప్రవేశించును.

బురదలోఁ దావులు విరజిమ్ము తమ్ములఁ
 బుట్టింపఁజాలెడు పట్టి శక్తి
కారుప్పు లొలికెడి కడలిజలంబుల
 మంచినీటినిఁ జేయు మహితశక్తి
పురుగుఁజిప్పల నాణిముత్యాల జంపుల
 గుత్తులఁ బూయించు గొప్పశక్తి
అడవిమృగమునాభిఁ గడలు నింపఁగఁజాలు
 కస్తూరి నిడుఁ బ్రశస్తశక్తి
గులకఱాలను రత్నముల్ గూర్చుశక్తి
చీఁకటిని వెల్గు సృష్టించుఁ జిత్రశక్తి
పాపులను బుణ్యుఁ జూపెడి ప్రౌఢశక్తి
ఏమి చేయఁగఁజాల దాయీశు శక్తి?

ఆహా! ఏమి ఆ పరమేశ్వరుని విలాసము. జగ మంతయు బంగరు పూఁతఁబూసినట్లు మెఱసిపోవుచున్నదే! అదిగో! ఆ లోకబాంధవుఁడు ఉదయమునుండియు దనకరప్రసారములచేనంధకారమునురూపుమాపి

లోకము నుద్బోధింప నాకాశవేదికపై నుపన్యసించి యుపన్యసించి కృతకృత్యుఁడై యిపుడిపుడే యస్తగిరిసానువుల సేదఁదేరుచున్నాఁడు. మముబోఁటి లోకసేవకుల కీతని చర్యలొజ్జబంతులు. (ముందుఁజూచి) ఎవరో! ఇటువచ్చుచున్నారు. (పరికించి) ఏమది! ఆశ్చర్యముగనున్నదే. ఆ ముందు నడచువాని ముఖమైఖరిఁజూడనాతఁడొక మహాజ్ఞాని కాఁదగు ననిపించుచున్నది. నివురుగప్పిననిప్పువలెపైకిలంతిగాఁదెలియరాకున్నను నీతఁడొక జ్ఞాని యగుట నిక్కువము. సాంగత్యము లభించిన హాలికులకువలె మాబోంట్లకిట్టి యుత్తమాధికారులు లభించిన సంతసము. విజ్ఞానబీజము లిందు పుష్కలముగ ఫలించు నాశ పొడముచున్నది. ఇందుపవిష్టుఁడనై వేచియుందును. (కూరుచుండును.)

(ముందు పోతన, వెనుక శిష్యులు నడచుచుఁ బ్రవేశింతురు.)

నారయ—స్వామీ! ఉత్తమకవిత యలవడవలెనన నేయేసామగ్రి యవసరము?

పోతన—కవిత ఆ యా సామగ్రినిఁ జూచికొని వచ్చునది కాదు. అది సహజముగ రసహృదయమునుండి నిర్ఝరిణివలె వెల్లవిరియునది. బాహ్యసామగ్రి దానికి సహాయకము మాత్రమే. సంతలోనుండి చెప్పు కవితకంటె నిట్టి ప్రశాంతప్రదేశములలోఁ జెప్పెడి కవిత హృదయంగమముగను, రసవత్తరముగను నుండదా? మఱి!

గంగన— చిత్తము. ఇట్టి నిరుపహతిస్థలమున ప్రకృతిసౌందర్యముతోడై కవిగానివానికిఁగూడ కవిత్వము దొర్లుకొనివచ్చును.

నారయ—తాను కవిత్వము చెప్పుట కిది యుపోద్ఘాతముకాఁబోలు! (సింగన నవ్వును.)

పోతన—తప్పేమున్నది? గంగనా! భయపడకుము. ఏదీ! ఆ వృద్ధ సూర్యుని నొక పద్యమున వర్ణింపుము.

చూచినఁ దెలియకపోదు. నా కుపచారములం జేయక పువ్వుపువ్వులనుండి నీ కవితావ్యాసంగమును జేసికొనుచుందును. నేనిదే ఆయోగి పుంగవు దర్శించి వత్తును. పూజ్యపూజావ్యతిక్రమ మనర్థదాయకము, (వీటినీటఁ బాదప్రక్షాళనముఁ జేసికొని శుచి యగును.)

శిష్యులు— (భయపడి) చిత్తము. అపరాధులము. క్షమింపుఁడు. (దూరముగఁ దొలఁగుదురు.)

పోతన— (యోగిని సమీపించి) మహాత్ముల కభివాదనములు. (నమస్కరించును.)

యోగి— నారాయణ! కనులు విప్పి, శుభ మస్తు. కూరుచుండుము.

పోతన— (భక్తితో) చిత్తము. చిత్తము. (కూరుచుండును.)

యోగి— (మౌనముతో నుండియుండి యొక్కప్పుడిగ) నాయనా! నీకొక విశేషము నిచ్చినచో దాని నేమి సేయుదువు?

పోతన— (తడుముకొనకుండఁగ) లోకారాధనమున నుపయోగింతును.

యోగి— (చిఱునవ్వుతో) నీ కొక మహాపద సంభవించినచో?

పోతన— భగవన్నియోగ మని సహింతును.

యోగి— మంచిది. నీకవన కళాభ్యాసము నొక విశేష మున్నదే! దానితో నింతవఱకు నెట్టి లోకారాధనము గావించితివో చెప్పఁగలవా?

(నవ్వును.)

పోతన— (ఉలికిపడినట్లయి, వెలవెలఁబోయి) మన్నింపుఁడు, మన్నింపుఁడు. తమరు సర్వజ్ఞులు. నాకవిత దుర్వినియోగము గావింపఁబడినది. పశ్చాత్తాపముతోఁ గుములుచునే యుంటిని.

(కన్నీరు గార్చును.)

ఆరకూటమునకై యపరంజి వెచ్చించు
మందుఁడ నైతి నో మాన్యచరిత !
పుచ్చుజొన్నల మెచ్చి ముత్యాలఁ గొల్చెడు
వెంగలి నైతి నో విబుధవర్య!
తాలకు మారొడ్డి రత్నాలు వెనజల్లు
బేల నైతిని కరుణాలవాల!
ఉప్పునకై పచ్చకప్పుర మిచ్చెడు
బొప్పనై చెడితి నో పుణ్యమూర్తి!
పొట్టకై కమ్మతేనియఁబోలు కవిత
కొల్ల వెట్టితి రాజుల కొలువులందు,
చేవగలకాల మెంతయొ చెల్లిపోయె,
నేమిచేయఁగ నున్నాఁడొ? యీశ్వరుండు!

యోగి — (దయతో) నాయనా! దురపిల్లకుము. బుద్ధిమంతుఁడవు. గావుననే పశ్చాత్తాపపడితివి. ఊబిలో వైచిన కాలు మెలఁకువతో లాగికొంటివి. ఇఁక శుభోదయము కానున్నది.

పోతన— (కరములు మోడ్చి) మహాత్మా! తమదివ్యదర్శనసంభాషణములవలన హృదయతాప ముపశమిల్లినది. ఈ దీనుని శిష్యపరమాణువునుగా స్వీకరించి యనుగ్రహింప వేడుచున్నాఁడ. (పాదములపై వ్రాలును)

యోగి— (లేవనెత్తి) నాయనా! దైవానుగ్రహమున్నచో నే కొఱఁతయు వాటిల్లదు. ఆదైవము మంత్రాధీనము గావున నీ కొక మంత్ర ముపదేశింతును. దానిని జపించి శుభములఁ బడయుము. శుచివై తివిగదా! ఇటు దఱియరమ్ము.

పోతన— చిత్తము. (సమీపించి చెవియొగ్గును.)

యోగి— (తారకమంత్రము నుపదేశించును.)

పోతన— (తన్మయత్వము నొందుచుండును.)

యోగి—సానఁబెట్టిన వజ్రమువలె నీతఁడీలోకమునఁ బ్రకాశింపఁ గలఁడు. మంత్రాస్వాదమున మైమఱచి యానందించుచున్నాఁడు. ఈశ్వరాజ్ఞ నిర్వర్తింపఁబడినది. ఇఁక నేఁ బోవచ్చును. నారాయణ! (మెల్లగఁ దొలఁగి యదృశ్యుఁడగును.)

పోతన— (కనులు మూసికొనియే) ధన్యుఁడను; ధన్యుఁడను; ధన్యుఁడను. ఆహా! ఏమి ఈమంత్రిమాధుర్యము.

పాలుంజక్కెర జుఱ్ఱితిన్, మధురమౌ పక్వాన్నముల్ మెక్కితిన్,
బూలంజారెడు తేనె గ్రోలితిఁ గడుం, బుండ్రేక్షుసారంబులం
జాలుంజాలనఁ ద్రావితిం, గలుగ దీస్వాదుత్వ, మీ మంత్రిపున్
వ్రాలం బోల్పఁగఁబోలు దివ్యసుధ, నాభాగ్యంబునం బొందితిన్.

మహాత్మా! భవసాగరముదాఁట నొక నిచ్చిన నీకివే నాకృతజ్ఞతా వందనములు. (యోగి యనుకొని ఱాతిపై నమస్కరించును.) (కనులు విప్పి యోగిని గానక) ఏడీ! ఆయోగివర్యుఁడు! ఏడీ! చిత్రము!

శిష్యులు— (గురువుగారిధ్వని విని పరుగున వత్తురు.)

పోతన— నాయనలారా! ఏడీ! ఆమహాత్ముఁడు?

నారయ—స్వామీ! ఇప్పుడే యీగుట్టచాటునకుఁబోవ జూచితిని. పోయి పట్టుకొని రానా?

గంగన }
సింగన } ఔను! ఈతనిని ఒక్క నిముసములో గాలించి పట్టుకొనెదము. సెల వైనచో!

పోతన— నాయనలారా! వారు సిద్ధులగు మహాత్ములు. అంత సులభముగ దొఱకువారు కారు. ఆహా! ఏమి ఆ మహానుభావుని దివ్యవాణి! ఏమి ఆనందము! (కనులు మోడ్చి స్మరించును.)

శిష్యులు— (ఒకరి నొకరు చూచుకొనుచు) అమ్మయ్యో! నోరు చాల జారితిమి.

పోతన— (తనలో) నేఁడు సుదినము. జీవితమున నొక నూతనాధ్యాయ మారంభ మైనది. ఒక నిధి చేఁజిక్కినది. దీనిని దక్కించుకొనవలెను. (శిష్యులతో) నాయనలారా! ప్రొద్దు గ్రుంకుచున్నట్లున్నది. సాయంకృత్యములఁ దీర్చికొందము నడువుఁడు.

శిష్యులు— చిత్తము. చిత్తము. దయచేయుఁడు. (అందఱు నిష్క్రమింతురు.)

(తెర వ్రాలును.)

(ద్వితీయరంగము : పోతన గృహము - పోతన, శ్రీనాథులు సంభాషించుచుందురు.)

శ్రీనాథుఁడు— బావా! ఇటు చూడు. ఎప్పుడును ఆ వేదాంతపు గొడవయేనా?

పోతన— ఏమి చేయుమనెదవు? "లోకో భిన్నరుచిః" అనిరికదా!

శ్రీనా— దాని కేమిగాని, ఆ భోగినీదండకము చాల చక్కని ధారలో పడినది సుమా! శ్రీ సింగభూపాలుఁ డానాఁడు తన భోగినిఁ జూచుకొని ముసిముసి నవ్వులతో నెంతయు లోలోన మురిసిపోయి నాఁడు. కావుననే నన్ను ముత్యాలజంపులతో ముంచివైచెను. రాజు చాల రసికుఁడు. స్వయముగ విద్వాంసుఁడు. ఏమందువు?

పోతన— అబ్బ! ఆ దుర్దినముల నేల తలంపునకుఁ దెచ్చెదవు? పోనిమ్ము! (విసుపుతో పెడముఖము పెట్టును.)

శ్రీనా—దుర్దినములా? రాజుల మెప్పించి రాజగౌరవముల నందిన దినములు దుర్దినములా? నీది విపరీతదృష్టి.

పోతన— ముమ్మాటికి దుర్దినములు. ఛీ! ఛీ! ఆమన చిన్ననాఁటి

నానా రాజసందర్శనములు, ఆ వందిమాగధస్తోత్రములు తలఁచుకొనిన మేను జలదరించుచున్నది. శ్రీరామ! శ్రీరామ!

శ్రీనా— (నవ్వి) ఇది వట్టి పిచ్చి. కావున్న, గుణసంపన్ను లగు ప్రభువులఁ బొగడిన నేమి? అందంత తప్పేమియున్నది! ఓహో! తెలిసినది. ఈ యభిప్రాయముతోడనే కాఁబోలు బావగారు భోగినీ దండకములో నొక్కచో రాజులఁగూర్చి "రాజుల్ బహువ్యాజులే, భోజులే, చంచలచిత్తులే, మత్తులే, ప్రేతకాయత్తులే, దోషసంసిక్త సంపాపులే, వీతమర్యాదులే" అని యేమేమో సెలవిప్పించియున్నారు. సాహస మనఁగ తమదే సాహసము. "ఇంటఁ దిని యింటి వాసములు లెక్కించుట" ఇదియే!

పోతన— అప్పుడే యుద్దేశముతో వ్రాసితినో గాని, ప్రభువులఁ గూర్చి యిప్పుడుమాత్రము నాకట్టి యభిప్రాయమే దృఢపడినది. అయినను అందు సాహస మేమున్నది?

శ్రీనా— సాహస మేమున్నదా? గ్రంథము వ్రాసినది తేని యాజ్ఞతో; చదువునది ఆతని యాస్థానమున; ఆతని కట్టెదుట. అట్టితఱి వినిపింపవలసినవి యేనా ఈ శ్రీసూక్తులు? బావగారి లౌకికజ్ఞానమున కిది నిదర్శనము గాఁబోలు!

పోతన— లౌకికమో! అలౌకికమో! దాన ముప్పేమివచ్చినది?

శ్రీనా— ముప్పా! అదెంతగొప్ప? దినములు మంచివైనందున ఆనాఁ డీసూక్తులపై నేరికిని దృష్టి పడినదికాదు. లేకున్న బావగారిపని మిడతంభొట్ల కథకు వచ్చి యుండెడిది. (నవ్వును.)

పోతన— ఓహో! శిరశ్ఛేదన మయియుండెడిది కాఁబోలు! శ్రీనాథుని యండయుండ భయమేల? (మందహాసము)

శ్రీనా— శ్రీనాథుఁడు! శ్లేషలకుఁ దక్కువా! ఔనులే! దాని కేమి గాని శ్రీసింగభూపాలుని జక్కఁగ నొక్క దండకముతో వలలో వైచుకొన్న చతురుఁడవు. బావా! ఈ ప్రాపకమున

దినదినాభివృద్ధి గావించుకొనుము. (భుజముపైఁ జేయివైచి)నీకేమి, బంగారు పిచ్చుకవు. రాజానుగ్రహమున ముందుఅగ్రహారముకూడ సంపాదింతువు.

పోతన— క్షుద్రములగు నీయాలోచనలకు అంతులేదు. కానిమ్ము! (ముందుఁజూచి) ఈతఁడెవరు?

రాజసేవకుఁడు—(వంగినమస్కరించి కమ్మనిచ్చును)

శ్రీనా— (లేఖనందుకొని చదువుకొని సంతోషముతో) ఓయీ! ప్రభువుగారికిమాయాశీర్వాదములందెల్పుము. రేపకడ సన్నిధానమునకు బయలుదేరి వచ్చుచున్నామనియు మనవి చేయుము.

సేవకు —చిత్తము. సెలవు. (నిష్క్రమించును.)

శ్రీనా— బావా! ఒక శుభవార్త దెల్పెదను. ఏమి పిండివంట చేయింతువో చెప్పుము?

పోతన— బావగారి చిత్తము పిండివంటలపైఁ బరువెత్తుచున్నఁ దక్కువేమి? మీయిష్టము వచ్చినది. చాలునా?

శ్రీనా— మంచిది. అట్లైన ఈ కమ్మని కమ్మ చదువుకొనుము.

పోతన— (లేఖ చదివికొని ముఖముచిట్లించి) ఇదియేనా! శుభవార్త! ఛీ! ఛీ! ఇఁక ఈరొంపిలో నే నడుగిడను.

శ్రీనా— (వెల్లఁబోయి) ఇదియేమి యన్యాయము? రసికుఁడైన సింగభూపాలుఁడు మదనోత్సవము జరుపఁగోరి ముద్దుగాఁ బిలువనంప మూతి బిగించుట పాడియా?

పోతన—అదియంతయు నాకుఁ దెలియదు. ఈయుత్సవముల కేఁగ నేరానని బట్టు పెట్టుకొంటిని. తమకొఱకును గొండవీటి రాహ్వానమంపిన ట్లీలేఖవలనఁ దెలియుచున్నది గదా! తమ కిష్టమున్నఁ దమరు దయచేయవచ్చును.

శ్రీనా— (నవ్వుచు) 'సిరిరా మోకాలడ్డుట' యననిట్టిదే! అయినను రాజసభ కేగిన దోసమేమి! రాజసభలకుం బోని కవి రాణింపఁడని తెలియదుగదా! (నిష్ఠురముగ) తెలిసినవానికిం జెప్పుట చాలకష్టము. లేకున్న 'నిరాశ్రయా న శోభంతే పండితా వనితా లతాః' అను సూక్తి నీ వెఱుఁగవా?

పోతన— తెలియును. అది సామాన్యవిషయము. ఈ రాజసభలం జేరుట గౌరవహీన మని నాతలంపు.

శ్రీనా— ఆఁ! ఆఁ! గౌరవహీనమా! (పరిహాసముతో) కానులే! కాను.

వాల్మీకివ్యాసుల వన్నెలు దఱుగవే !
రామభారతసభారామసీమ ?
కాళిదాసుని వాసి కాసంత మిగిలెనే !
విక్రమభూపకవిత్వగోష్ఠి ?
నన్నపార్యున కెంతో చిన్నతనముగాదె !
రాజరాజనరేంద్రరాజసభను !
తిక్కయజ్వకుఁ గీర్తి నొక్కవోవఁగ లేదె !
మనుమసిద్ధినృపాలు మందిరమున ?
కవులు వీరలు గారు, గౌరవము లేదు !
వడిగ మనమోమునను ప్రొద్దుపొడిచె నార !
భావవీథిని భావించి పలుకు మయ్య !
బావ ! సహజపాండిత్యప్రభావ ! సీవ !

పోతన—(నవ్వుచు) కవితాసనాథులగు శ్రీనాథులు వాదింపదొడఁగిన నెదురు నిల్చుట కెరితరము? బ్రమ్మని తిమ్మని,దిమ్మని బ్రమ్మనిఁ జేయఁగలశక్తి వారికి కన్నతోఁబెట్టిన విద్య. కాదేని, వాల్మీకివ్యాసు లకును దమకును ముడిపెట్టుకొనఁగలరా?

శ్రీనా—అదిగాదు। రాజసభాప్రవేశమున గొప్పతనమేగాని తప్పు లేదని యొప్పుకొనుము. తెలిసినదా? (గద్దించును.)

పోతన—బావా! ఇదిగో! నానిశ్చితార్థము వినుము! మఱి వేధింపకుము. అఖిలకల్యాణగుణరోచిష్ణుండగు నావిష్ణుండక్క రాజమాత్రుఁ డెంతటివాఁడైనను మెఱమెచ్చులకై కీర్తించి పొట్టనింపుకొన నామన మొప్పదు! చూడు! సకలచరాచరరక్షకుండగు నాపక్షివాహను మధుర గుణానుసంధానలసితమగు నా రసనము నరమాత్రులఁ బొగడ నియ్యకొనునా!

"మందారమకరందమాధుర్యమునఁ దేలు
మధుపంబు బోవునే మదనములకు ?
నిర్మలమందాకినీవీచికలఁ దూఁగు
రాయంచ చనునె తరంగిణులకు ?
లలితరసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకు ?
పూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరకం
బరుగునే సాంద్రనీహారములకు?
అంబుజోదరదివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేర నేర్చు ?
వినుతగుణశీల! మాటలు వేయు నేల?"

శ్రీనా— (విసువుతో) ఇదియేనా నీ కిటీవల ఎవఁడో జడదారి నూఱిపోసిన బోధ? కాదు; బాధ! చాలు! చాలు. కవితాసామ్రాజ్య పట్టభద్రులమై చేఁతగాని చవటలవలె గోళ్లు గిల్లికొనుచుఁ గూరుచుందుమా ? 'దేవుఁడు, దేవుఁ' డందు వే! అంతవఱకు వచ్చినచో, మాటవరుస కనెదను! ఱేఁడు దేవుఁడు కాఁడా? "నావిష్ణుః పృథివీపతిః"

అని నీ వెఱుంగనిదియా? అన్నియుఁ దెలిసి 'కాఁబట్టిన కుందేటికి మూఁడే కాళ్ళ'నినచో నెవ రేమి చేయఁగలరు?

పోతన — బావా! ఎవరి పిచ్చి వారి కానందము. దానికై వాదు లాడు టేల? నీ ప్రత్యక్ష దైవము లనినమ్మిన వారినే భజించి తరింపుము. నన్ను నా దారిని పోనిమ్ము?

శ్రీనా — రక్తసంబంధుల మగుటయు, మీఁదుమిక్కిలి చిన్న నాఁటినుండియు చెలిమికాండ్ర మగుటయు నే నింతగాఁ జెప్పవలసి వచ్చినది. కాదేని ఎవ రెట్లూరేఁగిన నాకేమి? కొంచె మోపికఁ బట్టిన నన్నియుఁ దెలిసివచ్చును. బావా! అట్లయిన నీవు మన్మథోత్సవమునకు రా వనినమాట! ఆ సింగభూపాలుని యాహ్వానమును ద్రోసిరాజందు వనినమాట! చెప్పుము. ఏదో ఖండితముగాఁ జెప్పివేయుము!

పోతన — ఖండితముగా నిం కేమి చెప్పవలెను? చెప్పవలయునది చెప్పివైచితిని. ఆ గోపాలుని దక్క మఱి యే భూపాలుని నేఁ జూడను.

శ్రీనా — నిజము! నిజము! నీ కిఁక కొంతకాలమునకు ఆగోపాలురఁ జూచు నదృష్టమే పట్టును లెమ్ము. బావా! నేను మాత్రము వేకువనే రాచకొండకుఁ బోవుదును. (భుజముపై జేయి వైచి) ఈ పర్యాయమునకుమాత్రము నీపైభూపాలున కాగ్రహము రాకుండఁగ నేదోవిధముగ సరిపుచ్చి చెప్పెదను. ఈనడుమ బాగుగ నాలోచించుకొని బుద్ధి మరల్చుకొనుము. నాకడ వాదించినట్లు ప్రభువులఁగూర్చి యింకేరికడను బ్రసంగింపకుము. గోడలకుఁ జెవు లుండు నందురు! మించిన, రాజులతోఁ బగ! జాగ్రత్త సుమా!

పోతన — పగయా! ఎందులకు? ఏమి యపరాధము చేసితి మని!

శ్రీనా — ఇంతకన్న నపరాధ మేమి కావలయును? వారి యాజ్ఞల నుల్లంఘించుట యపరాధము కాదా? ఇది యేఁటి కెదురీఁత! తెలిసినదా!

పోతన— ఇది యాజ్ఞల నుల్లంఘించుటయా? నా చిత్త మొప్ప కొనని పని చేయు ననుట యసరాధమా? 'జాగ్రత్త' యని భయ పెట్టుచున్నాఁడవే! ఈశ్వరేచ్ఛ యెట్లున్నదో యట్లు జరుగును. భయము లేదు.

నారయ—(ప్రవేశించి శ్రీనాథ, పోతనలను జూచి) నమస్కారము. నమస్కారము.

శ్రీనా— (చిఱునవ్వుతోఁ దల యూఁచును.)

పోతన— శుభ మస్తు. నాయనా! ఏమి కావలయును?

నారయ—చిత్తము! పురాణమునకు వేళ యయినది. వ్యాసపీఠము, గ్రంథమును నమర్చ వచ్చితిని.

శ్రీనా— (నవ్వుచు) ఓహో! పురాణ మున్నది కాఁబోలు! బావగారికిఁ దగనిఓపిక. కాసు రాలని పనికిఁ గాళ్లు విరుగఁగొట్టుకొనుట నా కలవాటులేదు. నేను కొంచెము వెన్నువాల్చి యొక్క కునుకు తీసెదను. (ఆవులించును.)

పోతన— అయ్యో! దివాస్వాపమా! మంచిది! బావగారు రాజ పురాణకాలక్షేపముఁజేసి యలసి నట్లున్నారు. రండు! లోపల విశ్రమింపుఁడు. మా గొడవ మాకు తప్పదు లెండు! (నారయను జూచి) నేనిదే వచ్చుచున్నాను. నీవు పురాణమునకు వలయు పరికరములతో సిద్ధము గమ్ము. (శ్రీనాథపోతనలు నిష్క్రమింతురు.)

నారయ—చిత్తము! (ఇద్దఱును లోనికిఁ బోనిచ్చి) ఈ మహాకవి ద్వయము ఒక్కచో నున్నపుడు భిన్నప్రకృతులుగల వ్యక్తిద్వయము ప్రత్యక్షమైనట్లు వింతగనుండును. ఒకనిని రాజసకిరణములకు రంజిల్లు సూర్యకాంత మనిన, వేఱొకనిని సత్వరశ్మికి ద్రవించు చంద్రకాంతమన వలయును. ఉల్లోలగంభీరమైన పారావార మొకరైన, మొగులు తునుకలు లేని యాకసము మఱియొకరు. మహానుభావులు! ఎవరికి వారె గుమ్మడికాయలంత ముత్యాలు. వారికొనగోటికి సాటిరాని

నాబోఁటి కెన్నఁదరమా! పోయి పని చూచెదను. (నిష్క్రమించును.)

తృతీయ రంగము — పేరావధాని యిల్లు

పేరా— (పొడుము పీల్చుచు) వీడి మచ్చమాయ! ఏడీ! ఈ పుల్లన్న! ఎంతసేపైంది పంపి? మహాకొంటె శుంఠకాయ. ఏ చెల్లెక్కుతున్నాడో! మా మామగారు కళ్లుమూస్తూ నాచేతిలో పెట్టారు వీణ్ణి! నాకూ చేతికడ్డ మవుతాడని రెండు చిన్నవి అపరంముక్కలు వాగించా! మొన్న చాకలివెంకాయ మెచ్చుకున్నాడు పెద్దలకి బియ్యం బాగా ఇప్పించాడని. ఏదో! ఇట్టాగే చిన్న చిన్న కొంపల్లో నలిగితే కాస్త పెద్దలోగిళ్లలో ప్రవేశపెట్టవచ్చు. ఒంటరిగాణ్ణి, నేను మాత్రం ఎంతకాలం అన్నీ చూచుకోగల్గును? ఒక వ్యాపారమా! ఒక సంగతా? ఈమధ్య. పోతన్నను సాధించితీరాలని చేసిన ప్రతిజ్ఞతో మరీ తీరుబడిలేకుండాపోయింది. (ముందుఁజూచి) అదుగో వస్తున్నాఁడు. పెళ్లికొడుక్కుమల్లే! (పుల్లన్నతో) ఏమిరా! ఇంతసేపు? వెళ్లినపని యేంచేసుకొచ్చావ్?

పుల్లన్న— (రొప్పుచు) బావోయి! బావా! అంతా నీవు చెప్పినట్టే చేశా! నే నెళ్లేప్పటికే అరుగుమీదున్నా రిద్దఱూను!

పేరా— వాళ్లకంట పడలేదుగదా! కొంపదీసి? చెప్పు!

పుల్లన్న— ఆఁ! నేనే! సింహద్వారంలోనుంచి తొంగిచూచి యిటుపనిగా దని దొడ్డిదారి కెళ్లా! తలుపు లోపల వేశుంటే గోడ దూకాను! చిల్లపెంకు కూడా గీచుకుపోయింది చూడు! (చూపును.)

పేరా— తాతినున్నం రాద్దాములే! జరిగింది చెప్పు.

పుల్లన్న—సందులోనుంచి ముంగిట్లోకి వచ్చి కదలకుండా గరిసికింద కుక్కపిల్లకిమల్లే కూర్చున్నా! నేనెళ్లంగానే పోతన్నగాక ఇంకో ఆయనే! పదేళ్లకి ఉంగరాలు పెట్టుకున్నాడే! ఆయన అంటున్నాడు: 'భోగినీదండకడియం ఎంతబాగా రాశావు! రాజు మెచ్చుకున్నాడు గదా!' అని. అదివిని పోతన్న 'ఛీ! ఛీ! ఆ తద్దినాలు ఇహ తలవద్దన్నాడు. ఇద్దఱికీ లటపిటయింది.

పేరా— (ఆలోచించి తలపంకిస్తూ) ఊఁ హూఁ! ఏమన్నాడ?

పుల్లన్న— మాటల్లో, ఆ కంచువాలాయన అన్నాడు పోతన్నతో! 'బావా! దండకడియంతో రాజుల్ని తిట్టావేఁ? ఎవరన్నా వింటే ఏమయేది నీపనీ?' అని. పోతన్న 'నాకేమీ భయంలేదు' అన్నాడు. ఇంతలో రాచకొండనుంచి ఉత్సవానికి రమ్మని రాజుగారిమనిషి వచ్చాడు.

పేరా— (ఆతురతతో) ఆఁ! పోతారా! కలుస్తుంటూ ఏ అగ్రహారమో కాజేయటానికి? అయినా! ఆరాజుకీ పనిలేదు. ఎప్పుడూ ఉత్సవాలనీ, ఊరేగింపులనీ, యీ కవిగాళ్లకే కట్టిపెడుతూ ఉంటాడు; మఱి పోతారా ఇద్దఱు!

పుల్లన్న— పోతన్నకి రాజుగారిదగ్గరికి పోవటం పరువు నష్టమట? కొత్తాయన పోతాట్ట.

పేరా— ఆఁ! పరువునష్టమా! సరే! నీవుపోయి అన్నంతిను! (పుల్లన్నను బంపివేసి) ఆఁ! మంచిసమయమే చిక్కింది, ఈపోతన్న పని పట్టించటానికి. 'ప్రభువంటే పోతన్న కొకగడ్డిపఱకగా ఉన్నదనీ, ప్రజలలో ప్రభుద్వేషము గలిగిస్తున్నాడనీ, పోనీ యని ఉపేక్షిస్తే పుట్టిమునుగుతుందనీ' ఇదిగో! ఈరాత్రి రాచకొండకు పోయి ఆస్థాన కవికి అంటపోడుస్తా! ఆయన రాజుగారికి పోతన్నమీద ఆగ్రహం పుట్టిస్తాడు. ఆ యాస్థానకవి మంచివాడు. పోతన్న అంటే మండిపడ్డాడా వేళే! అసత్యమనీ, పాపమనీ చూస్తే పనులుకావు. ప్రతిజ్ఞ నెరవేరదు. అయినా! శుక్రనీతిలో మానభంగమగు వేళ మనిషికి అబద్ధమాడినా అఘములేదనే ఆనతీయబడిందిగా! భయంలేదు! ఈదెబ్బతో పోతన్న పొగరణగాలి! నాపేరు పైకిరావాలి. అంతే.

(నిష్క్రమించును.)

తెఱ వ్రాలును.

తృతీయాంకము సమాప్తము!



# హాలికుఁడు

## చతుర్థాంకము

ప్రథమరంగము. ఏకశిలానగరము. కొందఱుమిత్రులు పరివేష్టింపఁ బోతన ప్రసంగించుచుండును.

ఒకవృద్ధు—(పోతన్ననుఁజూచి) నేనుకూడ నలుగురితో గోదావరి స్నానము గ్రహణంనాఁడైనను చేసివత్తమని బయలుదేరితిని! కాని ఆగంగలోఁ బాపములు పోగొట్టుకొను పుణ్యమబ్బలేదు! (వగ్గుచు) పాడుదగ్గు పడవేసినది. రాజుగారుకూడ వచ్చిరఁట! దర్శనముచేసితిరా? ఏమి బహుమానము?

పోతన—నేనా రాజును జూడలేదు. నాకు వేరొకరాజుగారిదర్శన మైనది.

వృద్ధు—ఇంకొకరాజుకూడ వచ్చెనా? ఎవరు నాయనా? ఎట్లున్నాఁడు? ఎక్కడ దర్శన మైనది?

పోతన— మనవిచేయుచున్నాను. నేను 'ఆరాకానిశాకాలమున అభ్రఙ్కషశుభ్రసముత్తుంగభంగయగు గంగమంజని గ్రుంకులిడి వెడలి మహానీయమంజులపులినతలంబున మహేశ్వరధ్యానంబు సేయుచుఁ గించిదున్మీలితలోచనుండనై' యుంటిని.

ఒకపండితుఁడు— పుణ్యకాలములలోఁ జేసినజపముఅనంతఫలదమని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి. శాస్త్రవిదులు తమరారీతి మహేశ్వర ధ్యానము చేయుట యొప్పు. పిమ్మట?

పోతన—అట్టితఱి!

'మెఱుఁగు చెంగటనున్న మేఘంబు కైవడి
నువిద చెంగటనుండ నొప్పువాఁడు
చంద్రమండలసుధాసారంబుపోలిక
ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు
వల్లీయుతతమాలవసుమతీజము భంగి
బలువిల్లు మూఁపునఁ బరఁగువాఁడు
నీలనగాగ్రసన్నిహితభానునిభంగి
ఘనకిరీటము దలఁ గలుగువాఁడు

పుండరీకయుగముఁబోలు కన్నులవాఁడు,
వెడఁద యురమువాఁడు విపులభద్ర
మూర్తివాఁడు రాజముఖ్యుఁ డొక్కరుఁడు నా
కన్నుఁగవకు నెదురఁ గానఁబడియె.'

ఒకవృద్ధు—ఇట్టివాఁ డెవఁడో మహారాజు కాదు, సార్వభౌముఁడై యుండవలెను. తరువాత నాయనా!

పోతన—పిమ్మట "ఏను నా రాజశేఖరుం దేఱిచూచి భాషింప యత్నంబు సేయు నెడనతఁడుదా 'రామభద్రుండ, మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుఁ దెనుఁగు సేయుము, నీకు భవబంధంబులు దెగు' నని యానతిచ్చి తిరోహితుం డయ్యె."

కొందఱు—ఆఁ! ఆఁ! శ్రీరామభద్రుండే సాక్షాత్కరించెనా! ధన్యులు! ధన్యులు! పోతన్నగారు.

ఒకరు—శ్రీరామభద్రుఁడు భాగవతము నే కోరెను. అది మిక్కిలి ఉత్తమగ్రంథము కానోపు! ఔనా?

పోతన— ఓ! భాగవతమా!

'లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం
జులతాశోభితమున్, సువర్ణసుమనస్సుజ్ఞేయమున్, సుందరో

జ్వలవృత్తంబు, మహాఫలంబు, విమలవ్యాసాలవాలంబు నై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్విజశ్రేయమై."

ఒకరు— ఆహా! భాగవతము కల్పతరువు. ఇఁకఁ దమరు భాగవతమునే వ్రాయుదు రనిసమాట! వేఱు గ్రంథమును వ్రాయరు కాఁబోలు!

పోతన—అది సకలగుణాఢ్యుండగు శ్రీరామభద్రుని యాదేశము; మొదలఁ దాల్పినది. కాక,

"పలికెడిది భాగవత మఁట,
పలికించు విభుండు రామభద్రుం డఁట, నేఁ
బలికిన భవహర మగు నఁట,
పలికెద, వేఱొండు గాథ పలుకఁగ నేలా?"

మఱియొకరు—నేఁటివఱకు తెలుఁగున భాగవతము రచింపఁబడ లేదు కాఁబోలు!

ఇంకొకరు— ఆఁ! అది ఎవరికి సాధ్యము? నేఁటికి పాండిత్యము, సరసకవిత, వీనికి వన్నె బెట్టు గుణసంపద గల పోతరాజుగారు లభించిరి. ఆ లోపము దీరినది.

పోతన— అయ్యా! అట్లనఁజనదు. అన్నివిధముల నాకంటె వేయిమడుంగులు మిన్న లగు పూర్వకవులు దీనిం దెలిఁగింప రైరనిన నుండుట నాపై నెనరుచేఁ గాని శక్తిలోపముచేఁ గాదునుడీ!

"ఒనర న్నన్నయ, తిక్కనాదికవు లీయుర్విం బురాణావళుల్
తెనుఁగుం జేయుచు మత్పురాకృతశుభాధిక్యంబు దా నెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్, దీనిం దెనింగించి, నా
జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్."

ఒకరు— ఓహో! అట్లయిన నిఁక కృతిపతిని వెదకుటయే తడవు కాఁబోలు!

మఱియొకరు — వెదకుటయా? సరసు లగు మనుజేశ్వరులు "మేము, మే'మని సొమ్ములు, వాహనమ్ములు గైకొని 'కృతికన్య ని'మ్మని పోతన్నగారిని బ్రతిమాలరా?

ఇంకొకరు— తప్పక ! వీరి గ్రంథమును గృతిఁ గొన్నవాఁడే సుకృతి. వీరికి సొమ్ములుగావు. రాజ్యసొమ్ములు ధారవోసి యైనను కృతిఁ గైకొన రాజులు సిద్ధముగా నున్నారు.

పోతన— మహాశయులారా ! ఏల యిన్నిమాటలు ?

"ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు, వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని, చొక్కి, శరీరము వాసి, కాలుచే
సమ్మెటవ్రేటులం బడక సమ్మతితో హరి కిచ్చి చెప్పెదన్"
నమ్ముఁడు నమ్మకుండుఁ డిదె నాకు హితంబుగఁ దోఁచు నియ్యెడన్.

కొందఱు— ఆహా! ఏమి వైరాగ్యము ! పోతన్నగారు నిజముగ భక్తులు.

నారయ— (ప్రవేశించి) నమస్కారము. బండ్లు కట్టితిమి. తమకై వేచియున్నారము.

పోతన— ఇదే బయలుదేరుదము. (లేచును.)

ఒకరు— నేఁడే బమ్మెరకుఁ బోవలయునా? ఒకటి రెండు దినములు మాయూర నుండి, మా పాపపుఁజెవుల కిన్ని మంచిమాటలు వినిపింపఁగూడదా ?

మఱియొకరు— అప్పుడే తొందఱపడుచుంటి రేల ? అయ్యో!

పోతన— క్షమింపుడు. మీవాత్సల్యమున్నచో ఓరుగల్లే బమ్మెర, బమ్మెరయే ఓరుగల్లుకాదా ? శ్రీరామచంద్రుని యాజ్ఞాపాలనము అవశ్యకర్తవ్యము గదా ! అనుజ్ఞ దయచేయఁ బ్రార్థించుచున్నాను.
(నమస్కరించును.)

అందఱు— (తిరిగి తిరిగి నమస్కరింతురు.)

ఒకవృద్ధు— గ్రంథము త్వరలోఁ బ్రారంభింపఁబడవలయును. నాయనా! 'శ్రేయాంసి బహువిఘ్నాని' అనిరి. జాగ్రత్తసుమా ! ఏవిఘ్నమువచ్చినను శ్రీరామచంద్రుని యనుగ్రహమున గ్రంథము పరిసమాప్తి నొందును లెమ్ము !

పెద్దలు— తథాస్తు! తథాస్తు. అభీప్సితార్థసిద్ధిరస్తు!

పోతన— అనుగ్రహింపఁబడితిని. అంతయుఁ బెద్దల యాశీర్వాదము; శ్రీరాముని యనుగ్రహము. ఇంక సెలవొసంగుఁడు. నేఁ బోయి వచ్చెద. సెలవు! (పోతనముందుఁ, దక్కిన వారు వెనుకను నడచుచు నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

ద్వితీయరంగము—ఉద్యానవనము; కైలాసకూటి పరిసరము.
సమయము—సాయంకాలము.

సింగభూపాలుఁడు— (ఆలోచనానిమగ్నుఁడయి అడుగులు వేయుచు) ఆహా! ఏమి కమ్మదనము. ఆబాల్య మమరవాణీసుధారసము గ్రోలి 'ఆంధ్ర'మనిన అఱచెవినిడు నాకే యందమనిపించిన దీతని కవిత్వము! కానరాని గడుసరి పోతన! నిండుకుండ! తొణఁకదు. ఆకారమును బట్టి నేనేమో యనుకొంటిని! ఆదండకమున నెన్ని చిన్నెలు వన్నెలు చిత్రించెను? పుణ్యభాగిని కావుననే మా భోగిని ఈసిద్ధహస్తుని కృతినిఁ బ్రతిబింబించు భాగ్య మందినది. (ఆలోచించుచు నాలుగడుగులు నైచి) అందఱి మాటకేమిగాని అబ్బబ్బా! ఈభోగిని పోరు పడలేకున్నాను. కనుపించినపుడెల్ల 'మీరుకూడ ఏదైన ఉత్తమ కృతిని ఆ కవిచేతనే వ్రాయించి కృతి పొందుఁడు; అప్పుడుకాని, నా కానందము చేకూర' దని వేధించుచున్నది. నాకును ఆతని కవితామృతమును గ్రోలిననాఁటగోలె అట్టి వాంఛయే గల్గి గట్టిపడినది. మొన్న ఈ పోతన్నకవి భాగవతమును ఆంధ్రీకరించుచున్నాఁడని యాస్థానకవి చెప్పఁగ విని ఆ గ్రంథమును నాకుఁ గృతినిచ్చినచో అగ్రహారము లిత్తు నని వార్త నంపితిని. ఏమనునో!

సేవకుఁడు— [నమస్కరించి] ప్రభూ! ఆస్థానకవిగారు దేవరవారి దర్శనమునకై వేచియున్నారు.

సింగభూ— వచ్చెనా? మంచిది. రమ్మనుము.

సేవకుఁడు— చిత్తము. ఆజ్ఞ! (నమస్కరించి వెడలిపోవును.)

ఆస్థానకవి—(ప్రవేశించును.)

సింగభూ — ఇటు! ఇటు! నమస్కారము! దయచేయుఁడు.

ఆస్థానకవి— (చేయియెత్తి) జయోఽస్తు! దిగ్విజయోఽస్తు!

సింగభూ—పని యేమైనది? పండా? కాయా?

ఆస్థానకవి—చిత్రము! మూర్ఖులు ముద్దు వక్కాణించుకొనెరా? నే నెన్నడో మనవిచేసితిని. ఆతనియహంభావమునకు అంతులేదు. సామో పాయము, సాత్త్వికులయెడను, సరసుల యెడనుగాని, యిట్టివారిపట్ల చతుర్థోపాయమే సత్వరఫలకారి.

సింగభూ—ఇంతకుఁ గృతి నీయనని నిరాకరించెనా? ఏమి?

ఆస్థానకవి—కృతులు! కృతులకేమి! సత్కృతిశతంబులకధిపతులు కాఁగలరు సర్వజ్ఞులు. నికృష్టుఁడు నిరాకరించుఁగాక! సంకల్పసిద్ధులు మాసార్వభౌములు.

సింగభూ—(దీర్ఘాలోచన చేయుచు) మంచిది. ఇంకేమి విశేష ములు?

ఆస్థానకవి — విశేషములా? విశేషముల కేమిలెండు? అల్పులకధిక గౌరవమిచ్చుటయు సనర్థమనియే యార్యుల యభిమతము. ఔరా! ఆగడము! ... అనువాచమైనను ఆమాటలనుటకు నాలుక వెనుకాడు చున్నదే!

సింగభూ— సంకోచింపక సత్వరముగఁ జెల్పుఁడు!

ఆస్థానకవి—చిత్రము! రాజాజ్ఞ! 'భగవంతుని సృష్టిలోఁ బ్రభువు ప్రజలు అను భేదములేదు. ఆదయామయుఁడు సమస్తప్రాణులయెడను సమానముగ వర్తించుచుండఁ బ్రభువులే యేదుగడలని కొల్చుట వెఱ్ఱితనము. ప్రభువులు ప్రజాసేవకులుగాని దొరలుగారు. ప్రజారంజ కుఁడుగానేరనివాని రాజశబ్దము నేతిబీరకాయవంటిది' అని యేమేమి మోపలురీతులఁ బల్లదనపుఁ బోకడలు పోవుచున్నాఁడఁట! విషూచి వలె ఈవిషబీజములు ప్రజలలో శరవేగమునఁ బ్రాకుచున్నవఁట!

బమ్మెరవాసియుఁ బరమవైదికనిష్ఠాగరిష్ఠుఁడును, ప్రభుభక్తిపరాయణుఁడునగు పేరావధాని స్వయముగఁ జెప్పిన మాటలివి. ఇందతిశయోక్తి గాని, అసత్యముగాని ఆవగింజంతయైన నుండ వీలులేదు. ఘోరా! ఎంతటి ద్రోహి! గుమ్మఁడాయి ఆమ్మగుద్దుట. ప్రభూ! ఆలసించిన అదనుమించును. కర్తవ్యమునాలోచింపుఁడు. [అటునిటుచూచి మెల్లఁగ] కృతిని వేఱొకతేనికిచ్చున నెడియొక కింవదంతి ప్రబలముగనున్నదనియూ సూచించి వెళ్లినాఁడు. ఇఁక నాకు సెలవా!

సింగభూ—(రెప్ప వాల్పక వీనులిచ్చి వినివిని తలయూఁచుచు) మంచిది! ప్రతివిధేయ మాలోచించెదము. తమరు దయచేయుఁడు.

ఆస్థానకవి-చిత్తము. (నెమ్మదిగ వెనువెనుకఁగ జరిగినిష్క్రమించును.)

సింగభూ--లోకము విచిత్రప్రకృతిక మనుమాట వాస్తవమేగాని, ఈ పోతనప్రకృతి చిత్రములలోఁ జిత్రముగ నున్నది. సిరిలేనివాఁడఁట! చేయి చాఁచి యడుగఁడఁట! రమ్యగుణాకరుఁడట! రాజద్రోహమునకు బీజావాపము సేయునఁట! ఆతనిఁగూర్చి వినిన దంతయు సత్యమే యగునా? సత్యమనుటకీ సామగ్రి చాలదా? మదనోత్సవమునకు రమ్మని పంపిన నా యాహ్వానమున కనాదరము! గ్రహణసమయమున నేఁ జేయఁబూనిన దానమున కప్రతిగ్రహసమాధానము! కృతిసమర్పణమునకు నిరాకృతి! ఒకటి, రెండు, మూడు. (పెదవి కఱచి, ఆపి, ఆపి) ఒకటి...రెండు...మూడు...(కనులు పెద్దవి జేసి) ఊఁ! బ్రాహ్మణుఁడని, పండితుఁడని, కవి యని పక్షపాతము వహించుకొలఁది పాకము ముదురుచున్నదే! (నిష్ఠురముగా) పోనిమ్ము! తన గ్రంథము. కృతి నీయనిచో. (కొంచె మాలోచించి) ఆఁ! ఎట్లు పోఁగలఁడు? నా యారామమున పూచిన పూవు, పండిన పండు నాయది. నా యనుభవమునకు రావలసినదే! రాజు రత్నహారి. శ్రేష్ఠవస్తువును సేకరించితీరును! సేవించితీరును! ఐహికమున నాతని కందనిది లేదు. కత్తిని గాని కార్యము లేదు. ఏమని, కింవదంతి? 'ఎవ్వఁడో కృతిఁగొన నున్నాఁడా?'

ఔరా! కాకోదరశిరోరత్నంబునకై కరము సాఁచు సాహసికుఁడును సాక్షాత్కరించెనా? చూచెదనుగాక! ఆజన్మ మెఱుఁగని అప్రాఙ్గంగము! అవమానము! (పండ్లు పటపట కొఱికి) ఓహో! పోతన! మంత్రేశ్వరులు సైతము నను దలఁచి కలఁకుండు ననుమండ నీ కెక్కడనుండి వచ్చిన వీ గుండెలు? అజ్ఞానమున కనుభవింపుము ప్రతిఫలము. ఇదిగో! గ్రామాధికారికిఁ గఠిన శాసన మంపుచున్నాను. సింగము చీకాకుపడిన చీల్చును! చెండాడును! (కోపముతో వెడలిపోవును.)

### తృతీయాంకము — పేరావధాని యిల్లు.

పేరావధాని—ఎహె హె! అగ్నిలో ఆజ్యం పోసినట్టు, మొదటే ఆహ్వానం తిరస్కరించాడనీ, గ్రహణంనాడు దానం ప్రతిగ్రహించ లేదనీ మండిపడుతూన్న రాజుకి ఈ భాగవతం కృతి యివ్వననటంతో ఒళ్లు మరింత మండింది. దాని ఫలితమే కావచ్చు ఆ గ్రామాధికారికి వచ్చిన ఆ రహస్యపు టుత్తరువు. పోతన్న నేవిధంగానైనా లొంగ దీయు మని వ్రాశారఁట రాజుగారు! ఇదివఱకే నేనెత్తిన ఎత్తులతో బంగారపుపిచ్చుక మట్టిపిచ్చు కయింది. ఎన్నాళ్ళు తెస్తాడు? పాపం! దినానికి పదిమందిని తరిమేవాణ్ణి యాచకులను. ఒక్కొక్కటిగా నిలుఁవుదో పయింది. కుండలాలు ఊడినై; సింహాలలాటాలు జారినై; శాలువలు ఎగిరిపోయినై. మొన్న చూస్తే జాలి వేసింది. కొడుకు, తాను పుండువంటి చలిలో అరక పట్టుకొని పొలం పోతున్నారు. అయినా, నాది జాలిగుండె కాసి. యిటువంటివాళ్ళమీఁద జాలిపడ గూడదు. ఆ అహంభావము! ఆ ఠీవి! ఓహో! కడుపు మండి పోయేది! ఎట్లాగో ప్రతిజ్ఞ నెఱవేర్చుకున్నాను! (ముందుఁ జూచి) ఏమి టదీ? మా పుల్లన్న గుండెలు పగిలేటట్టు పరిగుడుతున్నాడు!

పుల్లన్న— (వడఁకుచు) బావోయి! బావా! ఇంకేముంది పద లోపలికి. తలుపుగొళ్లెం పెట్టు! బాబోయి; బాబోయి!

పేరావ— ఏమిటాగొడవ? చెప్పరా! పిల్లలతో కీచులాడావా?

ప్రల్లన్న— పిల్లలతోగాదు పిడుగుతో! (వడఁకుచు) బావా! రాజుగారి భటులే విచ్చుకత్తులతో మెఱసిపోతూ పోతన్న యింటికి ఆయన పుస్తకాన్ని పట్టుకోటానికి వెడుతూఉంటే ఊసుపోక నేనూ వెనకాలే వెళ్లా! బాబోయి! బాబోయి! (నలుదిక్కులుచూచును.)

పేరా— భళీ! రాజాజ్ఞ! అప్పుడే కార్యరూపంలోకి వచ్చింది. ఎహెహెహె! రాజు దలచుకొంటే దెబ్బలకు కొదువా! అని సరే! తెలిసింది. ఆ తళతళలాడే కత్తులు చూసి భయపడ్డాడు పిల్లసన్నాసి. మంగలికత్తిచూచే వడకిపోయే వెంగలి, రాజభటుల కత్తులకు అదలిపోయినాడంటే ఆశ్చర్య మేమున్నది? ఇంతేనా వచ్చినఆపద? పుల్లన్నా!

పుల్లన్న— (విసుగుతో) ఆఁ! అక్కడుంటే బావగారి పని తెలిసేది! కత్తులంటే నాకేమిభయం!

పేరా— మఱి దేనికిరా నీకీ భయం?

పుల్లన్న— ఆఁ! అట్లా అడుగు. ఆ రాజభటులు పోతన్న ఇంటో దూరటానికి వెళ్లారా? వెళ్లేప్పటికే! (వడఁకుతు) అమ్మయ్యో! ఏమి చెప్పను! ఒక పెద్ద కొండంత మృగము! కోరలు అదీని! చెవులు గింగురుమనేట్టు అరుస్తూ వీళ్ళని చీల్చిపారేయటానికి మీఁద కొచ్చిందట! ఎక్కడివాళ్లక్కడే కత్తులు పారేసి కాళ్లుమొక్కి పిక్కకు బుద్ధి చెప్పారు. దూరాన్నున్నా నామీఁద ఎక్కడ విరుచుకు పడుతుందో నని పరుగెత్తుకొచ్చా!

పేరా— ఓసి! ఇంతేనా! పోతన్న మంత్రాలమారిరా. అప్పుడెవరో యోగి కనపడ్డా డనుకున్నారే! వాడిదగ్గఱ ఏవో కోయమంత్రాలు అఘోరించి యుండవచ్చు. అంతే! భయ మెందుకు?

పుల్లన్న— ఏమోనయ్యా! ఇఁక ఆయన జోలికి పోను. బుద్ధొచ్చింది. (చెంపలు వేసికొనును.)

పేరా— జడుసుకున్నట్టున్నావు! (ఒడలు తాకిచూచి) పులకరం తగిలింది. పద! ఇంత విభూతి మంత్రించి పెడతా! ఎక్కడదక్కడ ఎగిరిపోతుంది!

పుల్లన్న— ఏమిటి! విభూతా! (ఇద్దరు నిష్క్రమింతురు.)

చతుర్థరంగము—పోతన్న పొలము. పోతనమల్లన్నల ప్రవేశము.

మల్లన్న— మామగారికి ఎక్కడికి వెళ్లినను గౌరవమేగదా! ఏ రాజాస్థానముననైనను ప్రథమంతాంబూలము మాకవిసార్వభౌముని వంతే! ఆహా! మొన్నటి కనకాభిషేకము చూచి తీరవలసినదే!

పోతన— ఏమీ! అంత బాగుగ జరిగినదా?

మల్లన్న— వైభవమా చెప్ప నలవికాదు. ముత్యాలశాలలో మామగారి నాసీనులఁజేసి కవులు గీర్తింప దక్షిణాధీశుఁడు దీనార టంకాలతో నభిషేకముగావించెను. ఆనాఁడు శ్రీనాథుఁడన్వర్థనాముఁడై వెలిఁగిపోయినాఁడు. ప్రభువునకు నన్నుజూపి తన మేనల్లుఁడ ననియు, మహాకవీశ్వరులగు పోతన్నగారి పుత్రుఁడ ననియుఁ జెప్పెను. ఱేఁడు మిక్కిలి సంతసించి రత్నాలహారము నాకును బహూకరించెను. మన దురదృష్టము! తమరుచూడకమును పేదారిలో నేచోరగ్రస్తమయినది! [చిన్నపుచ్చుకొనును.]

పోతన— ఆ పాపపు ద్రవ్యము మనయింటికి రాఁగూడదనియే యీశ్వరేచ్ఛ. క్షణభంగురములగు నీసంపదలకై పడరానిపాట్లేల పడవలయును?

మల్లన్న— క్షమింపుఁడు! సర్వజ్ఞులగు తమ కెదురాడఁజాలను. కాని మామామగారిని గాంచినపుడుమాత్రము మనముగూడ నిట్లేల యుండఁగూడదనిపించును. అపరంజిపల్లెరములలో నారగించుచుఁగస్తూరి గుబాళింప ఆకులు బాగాలు వేసికొని, రత్నాంబరములతో రాచఠీవిని అందలములపై నటునిటు దిరుగు మామగారినిఁ జూచి, ఈయాకారముతోఁ దమను జూచిన నాహృదయము తఱుగుకొనిపోవుచున్నది. [దుఃఖించును.]

పోతన— నాయనా! అజ్ఞులకును, విజ్ఞులకును భేద మిట్టిపట్టులనే తెలియును. నీవు పేర్కొనిన వన్నియు యథార్థసుఖములు గావు.

సుఖాభాసములు, దుఃఖపరిణామములు. ఇదియనుభవమువలనముందుఁ దెలియఁగలదు. శాశ్వతానందకరమగు శ్రీనారాయణచరణారవింద మకరందమునకై యత్నింపవలెఁగాని యిట్టివానికై యమూల్యమగు సమయమును వ్యయ మొసర్పరాదు.

మల్లన్న— కావచ్చును. కాని, ఆనాఁడు రత్నభూషణములతోఁ, జీనాంబరములతో మాఅత్త మహాలక్ష్మివలెఁ బ్రకాశింప, మాఅమ్మను, బెద్దమ్మనువలెఁ జూడ హృదయము కంపించినది. మాతల్లియుల్ల మెంత దురపిల్లినదో! ఏరి కెఱుక?

పోతన— అవును! మీరు మీమామగారి యింటినుండి వచ్చిన పిమ్మట మీతల్లి దెందమునం గుందుచున్నట్లు నాకును బొడగట్టినది. అయినను, అశాశ్వతములగు సంపదలకై పాకులాడనాకుఁదీఱిక లేదు. పోనిమ్ము! (వినుట నభినయించి) ఎక్కడిదీ పల్లకీమ్రోఁత ?

మల్లన— (వంగిచూచి) అదిగో! మామగారు! మామగారు! పల్లకి దిగి యిటే వచ్చుచున్నారు.

శ్రీనా— (ప్రవేశించుచుఁ, దనలో) అయ్యో! ఆపోతరాజుగారా! వీరు! చెవినిల్లుగట్టికొని నూరిపోసినను, వినలేదుగదా! ఆనాఁడు. బంగారువంటి కాపురము బండలపాలుచేసెను. రాజులతోఁ బట్టుదల వలదు, వలదన్నఁ జెవి కెక్కలేదు. అయినవా రిట్లటమటింప నాకెంత గౌరవ మున్న నేమిసంతోషము? మొన్నమాశారదను జూచిన గుండె పగిలిపోయినది! కాదుగాని!

> "కమ్మని గ్రంథం బొక్కటి
> యిమ్ముగ నేనృపతికైనఁ గృతి నిచ్చినచోఁ
> గొమ్మని యియ్యరె వెయ్యా
> ర్లిమ్మహి దున్నంగ నేల? యిట్టి మహాత్మ్రుల్."

ఈమధ్య భాగవతము వ్రాయుచున్నాఁ డని విని, కృతి స్వీకరింప నా కర్ణాటప్రభువునుగూడ బురిగొల్పితిని. ఆతఁడును సంతసముతో

అంగీకరించెను. ఇఁక యీ దేవుఁ డేమనునో' వానితోఁ గొంచె
ముడుకెత్తించి చూచెదను. (సమీపించి) ఓహో! సవ్యసాచులు
బావగారు! గంటమును బట్టిన కేల నాఁగేటినిఁ గీలింపఁగల దిట్టలు.
హాలికులకు క్షేమమేగదా!

పోతన— విశ్వేశ్వరసోమదీక్షితుం డగు పద్మాక్షుఁ డుండగ నుండ
క్షేమముగా కేమిగాని, ఏమంటిరి? హాలికుల మనియా? ఔను;
హాలికులమే! తప్పేమి?

"బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకం
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికు లైననేమి? గహనాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికు లైననేమి? నిజదారసుతోదరపోషణార్థమై."

శ్రీనా— (నవ్వుచు) ఓహో! శాంతస్వరూపులు కోపులైన
ట్లున్నారు! క్షమింపుఁడు! క్షమింపుఁడు!

పోతన— రక్షింపను, శిక్షింపను, క్షమింపను - రాజులు, రాజాశ్రితు
లును సమర్థులు గాని మేమా! సరియే కాని ఇంటివద్ద మనవా రందఱకు
క్షేమమే కదా!

శ్రీనా— ఇంటివద్దఁ అ! అక్క డెవ రున్నారు? అందఱు బండ్లపై
బన్నెత్తి బయలుదేరినారు. ఈపాటికి ఇంటికిఁ జేరియుందురు. నా శిష్య
ప్రశిష్యులతోఁ గూడ నూరుమంది వచ్చితిమి. బావగారు భయపడరు
గదా! (నవ్వును.)

పోతన— భయమా! ఏల? సంతోషము! మఱి ఇఁక ఇంటికి
బోవుదమా? (మల్లన్నతో) నాయనా! నేఁటికి దున్నినంత చాలును.
అరక విప్పి దున్నలను దోలికొని రమ్ము. పాపము! నోరులేని
జంతువులు. ఎండ!

శ్రీనా— (నవ్వుచు) కావుననే 'బ్రాహ్మణవ్యవసాయ' మనినారు.
ఎండ యఁట! పాప మఁట!

మల్లన్న—చిత్తము. (ముందు పోతనశ్రీనాధులు పిమ్మట మల్లన్న నిష్క్రమింతురు.)

పంచమరంగము - పోతనయిల్లు

పోతన్న—నాతల్లి! ఇందిరాదేవికటాక్షమున నీముప్పు గడచినది. లేకున్న నేమయియుండెడివాఁడనో! ఉప్పుగల్లు లేక అప్పులు దెచ్చు నింట నూరుమందికి షడ్రసోపేతముగ నాతిథ్య మిప్పించినదే! నాజనని! పెనుశిల నుండెడి భేకములకు సైతము ఆహార మిప్పించి మనుచు మా రమారమణుఁ డుండ నాకేమి కొదువ? ఆతఁడు దయాసముద్రుఁడు; నమ్మినవారి కొంగుబంగారము.

శ్రీనా— (త్రేన్చుచుఁ బ్రవేశించి) అబ్బా! నేఁడు భుజించినంత నాజన్మమునందెన్నఁడును భుజించి యెఱుఁగను బావా! ఆహా! ఆ పదార్థముల రుచి! ఏది పట్టుకొనినను వదలఁబుద్ధిపుట్టదు. ఎందఱకో రాజులకు అతిథిగా నుంటినిగాని యిట్టి యాతిథ్యము నెన్నఁడును అనుభవించి యెఱుఁగను. సత్యము! ఇందతిశయోక్తి సుంతైనను లేదు.

పోతన— అంతయు శ్రీనాథుల యనుగ్రహము.

శ్రీనా— బావా! ఏది! ఆ భాగవతము విన వినఁ జవులూరు చున్నది. ఆ గజేంద్రమోక్షఘట్టము తలమానికముగ నున్నది. కాని! అప్పుడే యడుగవలయునని యనుకొంటిని. అపద్యము ఏది? మఱలఁ జదువుము! 'సిరికిం జెప్పఁడు.....ఒక్కతూరి చదువుము. చెప్పెదను.

పోత— అదియా! (పుస్తకము చూచి)

'సిరికిం జెప్పఁడు, శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ, డే
పరివారంబును జీరఁ, డభ్రగపతిం బన్నింపఁ, డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు వివాదప్రోద్ధితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై'

శ్రీనా— (నవ్వుచు) ఏమి! బావగారు విష్ణుమూర్తికిఁ గూడ అస్త్రసన్న్యాస మిప్పించినా రీపద్యమున? బావా! గజేంద్రుని

పర్యాలించి నక్రముం జీల్పఁ జక్రిముం గొనిపోవక, చక్రి వక్రగతి క్రిహాస్తములతో నాటకముం జూడఁబోయెనా! కవికిఁ, గవితా సంపత్తికిఁ దోడు లౌకికజ్ఞాన మవసరము. బావా! నీవేమైన ననుము. ఆ రాజసభలలో మెలఁగినఁగాని యట్టి లౌకికజ్ఞాన మలవడదుసుమా! బావగా రేమందురు దీనికి?

పోతన— (నిర్వ్యాజపడి) ఏమందురు? అఖిలలోకపాలుం డగు రమారమణుఁడే మీ దృష్టిలో వక్రిగతిం బడిపోవ,మన్ననలకు సున్న ఈ పోతన్న ఏమనఁగలఁడు?

శ్రీనా— వేఱుగ భావింపకుఁడు. గ్రంథము ద్రాక్షాపాకమునఁ బడి శ్రోతృహృదయముల నాకర్షింపఁ జాలియున్నది. ఇఁక! ఈ నెఱసుల కేమిలెండు. 'ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణే ష్వివాంకః' అని కవికులచక్రవర్తి కాళిదాసుని సూక్తి యున్నదిగదా!

పోతన— అగును. అతఁడు కవికులచక్రవర్తి! మీరు కవి సార్వభౌములు! ఉభయులును రాజపూజితులే! మీకు మీరే సాటి. అది యనన్వయాలంకారము.

శ్రీనా— ఏమీ! పద్యము నే సరిగ నన్వయించు కొనలేదని ధ్వనింపఁ జేయుట లేదుకదా! బావగారు. తలబ్రద్దలు చేసికొనినను నా కీపద్యమున నింతకంటె విశేషము గోచరించుటలేదు.

పోతన—నామాటలలో ధ్వనులు లేవు! శ్లేషలు లేవు! ఆపద్యమున నిపుడు ఏ విశేషము దోఁచకున్న వచ్చిన యిబ్బందియు లేదు. పాపము! మీరు తల బ్రద్దలుచేసికొననేల? కాని నే నిప్పుడే వత్తును. మీరు గ్రంథము నిట్లే చూచి దోసగులున్న సంకోచింపక సూచింపుఁడు. ధన్యవాదములతో స్వీకరింతును. మనము సర్వజ్ఞులము కాముగదా! సెలవు. (నిష్క్రమించును.)

శ్రీనా—అబ్బా! భోజనము గురు వైనది. కూరుచుండి చూడలేను; పరుండి చూచెదను.

లోపల పెద్ద ధ్వని.
'పిల్లవాఁడు నూతిలోఁ బడిపోయినాఁడు, మల్లన్నా! మామను పిలు! మామను పిలు!' అనెడి కేకలు. శ్రీనాథుఁడు అదరిపడి యటు నిటు పరుగెత్తును.

పోతన— (ప్రవేశించి) ఎక్కడి కాతొందరు? గంగవెఱ్ఱు లెత్తినట్లు ఆ చిందు లెందుకు? బావగారు! రండు!

శ్రీనా— (పరుగెత్తుచు) మాతండ్రీ! పడిపోయితివా! పడిపోయితివా!

పోతన— ఎవరు పడిపోయినది? ఎచ్చట?

శ్రీనా— ఎవరా? నా కన్నతండ్రి! నా కొడుకు! నూతిలో పడిపోయినాఁడు. అయ్యో! (పరుగెత్తును.)

పోతన— (చేయిపట్టుకొని తీసికొనివచ్చును. కూర్చుండఁబెట్టును.)

శ్రీనా— (గుండెలమీఁదఁ జేయి వేసికొని) అమ్మ! గుండె లవిసి పోయినవి! ఆ దడదడ యింకను తగ్గలేదు. నిజముగా పిల్లవాఁడు నూతఁ బడిపోయినాఁ డనుకొంటిని! అబ్బా! నీది మోటుసరసము సుమా!

పోతన— (నవ్వుచు) అలౌకికులకు లౌకికసరస మెట్లలవడును గాని; పిల్లవాఁడు నూతఁ గాలుజారి పడెనని నీవు వింటివిగదా! నిచ్చెన, త్రాళ్లు తీసికొనిపోక ఊరక బడితవలెఁ జేతు లూఁపుకొనుచుఁ బరుగెత్తు దేల? నూతిలోఁ బిల్లవాఁ డెట్లు మజ్జనోన్మజ్జనములు చేయుచున్నాఁడో కనులారఁ గాంచి స్వభావోక్తిలోఁ బద్యము లల్లఁ దలపెట్టితివా? ఇది లౌకికస్ఫురణ కాఁబోలు!

శ్రీనా— ఆఁ! అట్లే! చెప్పుట కేమి? కన్నకడుపు! ఆ హృదయోద్వేగము నీ కేమి తెలియును? నిచ్చెనలు, త్రాళ్ళు అప్పుడు స్మృతికి రావు.

పోతన— అవునుగదా! ఒక్క యినుమంత టెంగణాకొఱకు నీ విన్నియవస్థలపాలైతివే! పాపము! ఆ కరి, మకరికోరలఁ జిక్కి, లావుదక్కి,

ఆతిథ్యము నొసఁగుమించిన కవితామృతమును కుత్తుకబంటిఁ గ్రోలి, వచ్చిన పని మఱచితిని. ఇటు చూడుము! (భుజముపైఁ జేయివైచి) ఇదిగో! మున్న నీవు భాగవతము వ్రాయుచున్నావని కర్ణాకర్ణికగా విని మల్లన్న మాటతో నిజమని ధ్రువపడి యెంతయో సంతసించి, కర్ణాట ప్రభువ కేనొకనాఁడు నద్దానిఁగూర్చి విన్నవించితిని. అతిశయ మనుకొన కుండినచోఁ జెప్పెదను! నామాట యనిన నిప్పు డాతనికి వేదాక్షర ముగా నున్నది. ఇదియే సమయము. నామాటపై నీ గ్రంథమును గృతిఁగొన నాతఁ డువ్విళ్లూరుచున్నాఁడు. ఇఁక నీయిష్టము. నీ పరి స్థితులా! చాల దారుణమైనవిగదా! గుండిగలోని కాఁపురము గుప్పిళ్ల లోనికి వచ్చినది. కాలమా! మారుచున్నది. మఱి కొన్ని దినములకు నీకవిత్వముల నడుగువారైన నుండకపోవచ్చును. గాలి యుండగనే తూర్పారఁ బట్టవలయుఁగదా! త్వరలో నాలోచించు కొని, నామాట దక్కించి సుఖపడుము. ఇంత చెప్పవలె సమయముగ నిన్నుఁ జూచినాఁడు. మా చెల్లెలినిఁ జూచి. మహాలక్ష్మివలెఁ గళకళలాడు దాని నెమ్మోగము నేఁడు వన్నెదఱిగి దీనదీనమై యున్నది. నే నాదృశ్యము చూడలేను. నాకెన్నియుండిన లాభ మేమి? స్వర్ణభాజనమున భోజ నముచేయుచుఁ గూర్చుండ నిప్పుడ్చరమగు నీకుటుంబము గుప్పెడు గన్ను లకుఁ గట్టఁగబట్ట కొఱకుఁ దుఃఖము చేయుచుండువు రక్తసంబంధమట్టిది. ఏ రాజేంద్రుఁడు రత్నహారములతో బహూకరించుచుండినను, ఏ సరసుఁడు అమూల్యపదార్థముల నిచ్చినను, నిన్నుఁ దలఁచి కన్నుల నీరు పెట్టని సమయములేదు, నాకు జరుగు ప్రతిగౌరవమునను భాగ స్వామివి గాఁదగు నీవు లేకుండుట నాకుఁ గుడిభుజము లేకుండుట. ఎంద ఱెందరో కొమ్ములుదిరిగిన పండితులు, కవులు, రాజసమ్మానమునకై నాయింటి ప్రక్కలఁ బడిగాపులు పడియుందురే! మన కేమైన అట్టిగతి పట్టినదా? తమకుఁ దాముగా ధరణిపతులు ధర్మాధికారపదవుల నిచ్చి పువ్వులఁ బూజింతురే! బావా! ఆలోచించుకొనుము. నే నిప్పుడే క్రమ్మఱి వత్తును. (నిష్క్రమించును.)

పోతన— (వినివిని స్తబ్ధుఁడై కనులు మోడ్చి తలయూఁచుచు) ఔను! ఈతఁడు చెప్పినదంతయు నాలోచింప యథార్థమే. ఒకప్రక్క ఆలుఁబిడ్డలు అన్నమో రామచంద్రా యని యేడుచుండిరి. వేఱొకప్రక్క అప్పులవాండ్రు తిప్పలు పెట్టు మనమునకు శాంతి ఎక్కడిది? శాంతి లేక సౌఖ్య మెక్కడిది? ఇఁక ఈతఁడా! ఎవఁడో సామాన్యుఁడు కాఁడు. బంధువు; శ్రేయోభిలాషి. మీఁదు మిక్కిలి మహారాజగౌరవము లందిన సంపన్నుఁడు. ఎప్పటినుండియో చెప్పుచున్నాఁడు. అతనికి జరుగక కాదుగదా! ఇఁక నా కుటుంబకష్టములు చూడలేక, ఏదో దారి చూపించుచున్నాఁడు. పైగ, కర్ణాటప్రభువునకు మాట యిచ్చివచ్చినాఁడఁట. నేనిప్పుడు త్రోసివేసిన, నలుగురిలోఁ దిరుగువాఁడు చిన్నబుచ్చుకొనును. (కొంచె మాగి, ఆలోచించి, ఏదో అభిమానము చంపుకొని, (గద్గదికతో) ఈభాగ ......అబ్బ! నో రెండుచున్నది. ఈభాగ-వ-త-మును, ఆకర్ణాట, అమ్మో! ఆకర్ణాటప్రభువున కిచ్చి, కష్టములు గట్టెక్కుదునా! (ఒడలు గగుర్పొడువ ముందుచూచి, ఎవరది! (తొందరతో) ఆ! అహో! హంసపీఠమా! ఈ కేలఁ బుస్తకమా! (కంపముతో) ఆఁ! ఆఁ! ఏమి నాతల్లీ! అట్లు వాపోవుచుంటివేమి తల్లీ! నాపాలికల్పవల్లీ! వలదు! వలదు! శారదాంబా! దుఃఖింపవలదు. దుఃఖింపవలదు. క్రూరుఁడను; అజ్ఞానిని; ద్రోహిని. క్షమింపుము! క్షమింపుము! తల్లీ! (దుఃఖముతో)

"కాటుకకంటినీరు చనుకట్టుపయిం బడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల! యోమదంబ! యో
హాటకగర్భురాణి! నిను నాఁకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట, కిరాట, కీచకుల కమ్మఁ, త్రిశుద్ధిగ నమ్ము! భారతీ!

(ఆలకించుట నభినయించి) ఆఁ! ఏమనుచున్నావు! క్షమించితి నంటివా! ధన్యుఁడను. ధన్యుఁడను. అమ్మా! మందహాసముతో నీ ముఖారవిందము ఆనందమయమై గోచరింపఁ బ్రాణములు కుదుటఁ

బడినవి. బుద్ధి వచ్చినది. ఇఁక అట్టి పెడతలంపుల జోలికిఁ బోను. నీపాద మాన! (మ్రొక్కును.)

శ్రీనా— (సంతసముతోఁ బ్రవేశించి) ఏమది? బావగారు గాలికి మ్రొక్కుచున్నారు! (నాలుకఁ గొఱికికొని) 'కాలి' కనుకొని తప్పఁ బట్టకుఁడు! 'గాలి'కి కాదు! అది సంధి 'గా' కాదు. సిద్ధము.

పోతన— మీరు సంధినిపుణులై సంధాతలు గావలయు ననుకొనినను మనకు సంధి పొసఁగదు లెండు. ఈమాట సిద్ధము.

శ్రీనా— ఏమది? నాకు స్పష్టముగఁ జెప్పుఁడు! 'మనకు సంధి కుదుర' దనిన నాకుఁ దెలియుటలేదు.

పోతన— తెలియకపోవుట కేమున్నది? మీరు రాజులకును, నాకును గుదుర్పఁజూచిన సంధి కుదుర దని! ఇంతియే!

శ్రీనా—(తొందరగా) అయిన బాగుగ నాలోచించుకొని ఈనిర్ణయమునకు వచ్చితిరి కాఁబోలు! గ్రంథమును సర్వజ్ఞప్రభువునకుఁ గృతి నీయరు? నామాట నీటఁ గలిసిపోవలసినదే?

పోతన—మీ కేమైన నిష్ఠురము లాడుఁడు. ఏమైన ననుకొనుఁడు. నే నాగ్రంథమును శ్రీరామభద్రున కే యంకిత మీయ నిర్ణయించితిని. నా నిర్ణయము మారదు. క్షమింపుఁడు.

శ్రీనా—(కోపముతో) ఔరా! 'వినాశకాలే విపరీతబుద్ధిః' అనినట్లున్నది నీపని. నేఁ జెప్పిన వన్నియు బధిరశంఖారావము లైనవి. భస్మాహుతు లైనవి. ఛీ! ఛీ! చదువుకొనినవాఁడ వనియు, జెప్పినను దెలియుదా యనియు ననుకొంటినిగాని ఇట్టి యవివేకి వని, అజ్ఞాని వని, జడుఁడ వని యెఱుఁగను. చాలు! చాలు! నీ కర్మము నీది. అనుభవింపుము. నే నిఁక ఈస్థితిలో నిన్ను చూడను చూడను! నిక్కముగాఁ జూడను. (చఱచఱ వెడలిపోవును.)

పోతన— (నవ్వి) ఓహో! నరులు చూచిన నా కేమి? చూడకుండిన నా కేమి? నారాయణుఁడు చల్లఁగఁ జూచినఁ జాలును. మనుష్య

చిత్తమా! శ్రీహరి జింతింపు మేవేళ
రసనమా! కీర్తించు రామభద్రుఁ
చేతులారా! మీరు సేవింపుఁ డీ విష్ణుఁ
గర్ణంబులార! తత్కథల వినుఁడు
కనులార! గాంచుఁడు కమలనాభుని రూపు
ఘ్రాణమా! తులసీసుగంధ మాను
పదములార! జనుఁడు పద్మేశునిలయంబు
శీర్షమా! నతు లిడు శ్రీనివాసు

సర్వలోకేశు సేవలు సల్పుకతన
పెరటికల్పక మానంట పరమపదము
శ్రీశుఁడే యుండగా నుండఁ జింత యేల?
కనకగిరి నేలునానికిఁ గఱవు గలదె?

ఇప్పటికి [illegible] పవిత్రమైపోయినది.
ఇఁక పోయి భాగవతరచన సాగింతును. (నిష్క్రమించును.)

తెఱ వ్రాలును.

చతుర్థాంకము సమాప్తము





[illegible]



## పంచమాంకము

ప్రథమ రంగము — పోతన భాగవతమును ఏకాగ్రదీక్షతో వ్రాయుచుండును.

శారద— (చేతిలో గిన్నె తీసికొని ప్రవేశించి) అయ్యో! నేటికి మూడుదినములు; నిద్రలేదు. ఆహారము లేదు. ఒకరితో మాటలాడరు. తమలోఁ దాము నవ్వుకొనెదరు. ఆనందింతురు. ఆహారము లేమి నీరసము గలిగి శోష వచ్చునేమో యని భీతి గలుగుచున్నది. తల్లీ! రుక్మిణీ! ఆ భక్తవత్సలునితోఁ జెప్పి నా భర్తకే బాధయు లేకుండఁగఁ జేయవా! (సమీపించి) ఇదిగో! ఇటు చూడుఁడు! ఈకొంచెము జావ తీసికొనుఁడు.

పోతన—(వినిపించుకొనకుండఁగ) భాగవతాగ్రగణ్యా! ప్రహ్లాదా! [illegible] ముత్తించె! గిరులనుండి ద్రోబ్బించెను! ఎన్ని విధముల నోహింసించె! ఔరా! అడుగు వెనుదీసితివా! నీచరిత్రము వ్రాసిననాఁటఁగో లె ఆత్మప్రత్యయము నా కధికమైనది. ప్రభువు బగఁబట్టి పలుకడగండ్లఁ బెట్టుచున్నాఁడు. పశుబలమున బాధించుచున్నాఁడు. చూచెదనుగాక! నిన్నుఁ గాపాడిన నీరజేక్షణుఁడు నన్నేల కాపాడఁడో! చూచెదనుగాక?

శారద—ఇదిగో! మిమ్మేలనే! ఈ కొంచెము జావ తీసికొనుఁడు. మూఁడురోజు లయినది; శోష వచ్చునేమో!

పోతన— (తల యెత్తి) నీవా! చేతిలో నదేమి? జావా! అదెట్లు సంపాదించితివి!

శారద— అయ్యో! దైవమా! ఏమి చెప్పను? మన లేమిడి చూడలేక పాపము! కోరిన వస్తువులెల్ల తీసికొని పొమ్మని కోమటి సుబ్బయ్య మల్లన్నతో మఱిమఱి చెప్పెనఁట. కాని, యింతలో గ్రామాధికారి వచ్చి కాళులు గూసి తమరు రాజద్రోహు లనియు, రాజద్రోహులకు సహాయము చేయుటకూడ నేరమే యనియుఁ బెదరించి మల్లన్నను బంపివేసెనఁట. నిన్న ప్రక్కయింటివారు రహస్యముగ పిలిచి పిల్లల కింత యన్నముఁ బెట్టిరి. నేఁడు ఆశ్చర్యము! అవెట్లు వచ్చినవియో అంగణములో అజాపోలేఁడు జొన్నలు అగపడ గంజి కాఁచి తెచ్చితిని. పుచ్చుకొనుఁడు. ప్రొద్దెక్కినది.

పోతన— ఎహెహెహె! పగఁగొని యీ ప్రభువు చేయఁగలిగిన దీపాటియేగదా! ఆహారము నడ్డగింపఁగలఁడు. దేహమును దహింపఁ గలఁడు. నా యాత్మ నంటఁగలఁడా?

శారద— అయ్యో! రామా! అపరాహ్ణమైనది. ఆలసింపక దీనిని పుచ్చుకొనుఁడు.

పోతన— వలదు. వలదు. నన్నుఁ బరీక్షించుచున్న యీ భగవంతుని నేనుమాత్ర మేల పరీక్షింపను? నా సంకల్ప మీడేఱువఱకు నే నాహారము నంటను. ధనవంతుఁ డని యీ ధరణీశు నెగ్గించునో, దరిద్రుఁడ నని నాపై దయఁజూపునో దీనితోఁ దేలిపోవలెను.

(లోపల పిల్లలు వచ్చు చప్పుడగును.)

పోతన— అరుగో! పిల్లలు! పొమ్ము! నా భాగవతరచనకు మీరు అంతరాయముఁ గల్పింపకుఁడు. (భాగవతము వ్రాసికొను చుండును.)

శారద—అయ్యో! పట్టిన పట్టు వదలరు! ఓ దీనవత్సలా! నన్నేమి చేయఁ దలపెట్టితివి? (దుఃఖించును.)

(లోపలినుండి) అమ్మా! ఆఁకలి! అన్నము పెట్టవు?

శారద— ఆఁకలితోఁ బిల్ల లటమటించుచున్నారు. ఈ గంజి త్రాగింతును. మాకు పైన దైవ మున్నాఁడు. [తెర వ్రాలును.]

ద్వితీయ రంగము - రాచకొండ రాచనగరు.

సింగభూపాలుఁడు— (ఒంటరిగ శయ్యపైఁ గూరుచుండి) అయ్యో! ఏమి యీ వేదన! ఏమి యీ వేదన! ఇది యేదైన రోగ మనుకొందునా? ధన్వంతరులఁబోలు భిషగ్వరులు కంటికిఱెప్పవలెఁ గాచుచుండ నదెట్లు సంభవించును? చిత్తవిభ్రమమా! సర్వపదార్థములు యథార్థములుగ గోచరించుచుండ నట్లనుకొనుటెట్లు? ఐన నీ హృదయాందోళనము నకుఁ గారణ మేమి? శత్రువులు రాజ్యమును ముట్టడించిరా? లేదే! ప్రకృతిజనముల విద్రోహము చెలరేఁగినదా? పాపము! నా ప్రజలు హృదయపూర్వకముగ నన్నుఁ బ్రేమించుచుండిరే! కోశాగారమా! అక్షయమే! శాసనమా! అమోఘమే! మఱి నావంతకుఁ గత మేమి? అయ్యో! ప్రకృతియంతయు మైమఱచి నిద్రాసుఖమునఁ దేలియుండ అఖిలరాజ్యరమావల్లభుండనై సర్వసౌఖ్యముల నఱచేతఁ బట్టియున్న నాకర్మమిదేమి? అఱనిమసము కూన్కురాదే! కనులుగట్టిగ మూసి కొనెదను నిద్ర వచ్చునేమో! (కనులు మూసికొని కొంతసే పుండి ఉలికిపడి) ఆఁ! ఆఁ! ఈ యాకార మేమి? ఇదియేదియో భూతము! భూతము! పిశాచము! పిశాచము! (అటునిటు చూచి) ఎందుఁజూచిన నందే ప్రత్యక్ష మగుచున్నదే! ఆఁ! రా! దాపునకు రారమ్మనుచున్నదే! గ్రుడ్లురుము చున్నదే! తఱుముచున్నదే! ఆఁ! అదేమి అట్లు వికటాట్టహాసము చేయుచున్నది? చూడలేను! (కన్నులుమూసికొని, కొంచెమాగి మరల తెఱచి) పిశాచమా! (కోపముతో) రాచబిడ్డను, పౌరుషశాలిని, ఇదిగో! కరవాలము; ఈపిశాచములకు భయపడను. ఈకత్తితో తుత్తునియలు జేసెదను. (కత్తినెత్తి తేఱి పారఁజూచి) ఏదీ! పిశాచము! కాదు, కాదు. ఆ సత్వసంపన్నమగు వదనము, ఆ శాంతములొల్కు చూడ్కులు పిశాచములకును, భూతము

ళకును నుండవు. ఆహా! బ్రహ్మతేజము దిక్కుల నిండుచున్నదే! చిఱు నవ్వు మోమున తళుకొత్తుచున్నదే! మాటలాడకయే మనస్సు నా కర్షించుచున్న ఈవ్యక్తిని నేనెక్కడో, ఎప్పుడో చూచినట్లున్నానే! (తేఱిచూచి)చూచితిని! చూచితిని! నిక్కముగఁ జూచితిని. అయ్యో! పాడుబుద్ధి! మట్టిబుద్ధి! సమయమునకు స్మృతిరాదు. (మూలల చూచి) అదిగో! ఆచేతిలో నేదియో పుస్తకమున్నది. ఏమిపుస్తకమో! ఆ పై పేరు చూడు! ఆహా! ఏమియక్షరములు! ముత్యాలకోవ! చదివెదను. 'శ్రీ-రా-మ-భ-ద్ర-న-కుఁ-గా-ను-క', 'శ్రీ-మ-హాం-ధ్ర-భా-గ-వ-త-ము'. (తొందరపాటుతో) నీవా! మహాత్మా! తేలినది తెలిసినది. కవిరాజువు, పోతరాజువు, భక్తశిఖామణివి. అయ్యో! పాపాత్ముఁడను, క్రూరుఁడను, రాజ్యమదాంధుఁడను, అవివేకిని. పెరటికల్పకమును గుర్తింపనైతిని. సుగుణనిధినిఁ గాననైతిని. (గుండెలు బాదుకొనుచు) బాపురే! తలఁచుకొనిన గుండె చెఱువగుచున్నదే ఎన్నియిడుములఁ బెట్టితిని! ఎంతి గాసి నొందించితిని నా దుష్టరతతో నీ భక్తపరకుటుంబ మెన్ని శుష్కోపవాసములు జేసెనో; నన్ను భస్మము సేయు నశనిపాతములవలె నీ పవిత్రాత్మని కనుఁగవనుండి యెన్ని యశ్రుబిందువులు రాలినవో! ప్రశాంతమగు నీభక్తాగ్రేసరుని మానసము నా చెడుఁగుచెయిదములవలన నెంత కలఁతనొందినదో! నా కిఁక నిష్కృతి లేదు. వేఱు శరణ్యము లేదు. పుణ్యమూర్తీ! నీ శిష్యుఁడను. క్షమింపుము, రక్షింపుము, రక్షింపుము (పాదములపై వ్రాలును.) (లేచి) ఆఁ! ఏమనుచున్నావు? క్షమించితి ననియా? ధన్యుఁడను. ధన్యుఁడను. ఆహా! ఆనందము. నీ హస్తస్పర్శముచే శరీర మంతయుఁ జందనరససేకమున వలె హాయిఁ గొల్పుచున్నది. (సవ్రీడ)ఎంత యజ్ఞానము! దేవతాసార్వభౌముఁడగు శ్రీరామభద్రునకై యుద్దేశింపఁబడిన కృతిని వెంగలినై నే నాశించుటా! సుపర్వయోగ్యమగు హవిస్సును శునక మాసించినట్లు! సిగ్గు! సిగ్గు! అయిన దేదియో యయినది. ఇఁక ఆలసింపరాదు. నేఁడే సర్వసన్నాహములతో

బమ్మెర కేగి శ్రీరామచంద్రునకు వైభవముగఁ గృతిసమర్పణోత్సవము చేయించి తరించెదను. [నిష్క్రమించును.]

తృతీయరంగము – బొడ్డుపల్లెలో రచ్చచావడి.

గ్రామాధికారి సుంకరి అంకిసీడు, కరణము మంత్రిప్రగడ రఘుపతిరాయఁడు సంభాషించుచుందురు.

సుంకరి— మండలాధికారికి యెన్నివిధముల మనవి చేయవలెనో యన్నివిధముల మనవిఁజేసితిని. కాని,ఆ దొరగారన్నియుఁ బెడచెవిని బెట్టుచున్నారు. పైగ శ్రీనాథమహాకవి యనఁగనే యదేమియో మండిపడుచున్నారు.

మంత్రిప్రగడ— అయ్యో! దైవమా! చదువుల బృహస్పతియే! రాజసభాగౌరవము లందిన కవిరాజే! వృద్ధుఁడే! బ్రాహ్మణుఁడే! సుంత కనికర ముండవలదా? ఏమి! ద్రవ్యము కట్టుకొని పోవుదురా?

సుంకరి— అన్నియుఁదెలిసి తమకుకూడ నట్లాడిన నేమి చెప్పుదును? నా కేమైన ఆ బ్రాహ్మణునిపైఁ బగయా? ఆ కవిసార్వభౌముని ఘోష తాకుచిచ్చై, మన బొడ్డుపల్లెనే కాదు,ఒడ్డెరాజుల రాజ్యమునే స్వాహా సేయు నేమో యని దిగులుపడువారలలో నే నొకఁడ నని తమకుఁ దెలియునా?

మంత్రిప్రగడ— సత్యము. అందు ఆవంతయు సందేహము లేదు. గ్రామ మంతయు గలిసి నేరుగా రాజుగారికే మనవి చేసినచో నేమైన లాభ ముండు నేమో? 'సంఘే శక్తిః కలౌ యుగే' అనినారు గదా!

సుంకరి—ఇది నట్టి యడియాస! గ్రామమంతయు గాదు మండల మంతయుఁ గదలి వెళ్ళి మొఱపెట్టుకొనినను ఆ దొరలు వినెడివారు కారు. మీఁదుమిక్కిలి దీని ఫలితము ఆ బ్రాహ్మణునకు వఱకమో! దేశాంతరవాసశిక్షయో గలుగవచ్చును.

మంత్రిప్రగడ— అయ్యో! అన్యాయమా! మనమందరము కనులారఁ జూడలేదా? నోటికందినపంట యేటివరదకుఁగొట్టుకొనిపోలేదా?

తే తెమ్మనిన ఏడునూరులు ఆ బ్రాహ్మణుఁడెక్కడనుండి తేఁగలఁడు! ఆ కొంచెము వదలివేసినచో బ్రాహ్మణసమునకేమైన వెలితి గలుఁగునా? ఛీ! ఏడునూర్లు! ఆ కవీశ్వరుని యొక్క పద్యమునకు దిగఁదుడుపు!

సుంకరి — సత్యము. తమరు సెలవిచ్చిన దంతయు సత్యము. అది హృదయము గలవారికడఁ జెప్పవలసినమాట. నేఁడే ఆమహారాజు ఏ వీరభద్రారెడ్డియో జీవించియుండిన ఏడునూర్లు కాదు ఏడువేలు మాటలోఁ గొట్టివేయించి యుండును! (అటునిటు చూచి మెల్లఁగ) ఒడ్డెరాజులో మడ్డెరాజులో అన్నారు. తరతరములనుండి వచ్చిన యుద్యోగములుగదా యనికాని లేకపోయిన నెప్పుడో వదలి పారవేసి యుండెడివారము

మంత్రిప్రగడ — నిజము! ఏమిపాముకొనుచున్నాము? సాధుహింస చేసి దోసిళ్ళకొలఁది పాపముపంచుకొనుచున్నాము. శ్రీరామ! శ్రీరామ! మొన్న ఎఱ్ఱని యెండలో నల్లగుండు నెత్తుచుండఁగఁ జూడలేకపోయితిని. ఆకవీశ్వరుని యుసురు తగులక మానునా?

సుంకరి — ఈపాడుఉద్యోగముఅటువంటిది. ఏమిచేయను? పైనుండి దూఁకు పిడుగులవంటి యాజ్ఞలను బాలింపనా? కడుపు తఱుగుకొనిపోవు కవీశ్వరుని కష్టములఁ జూతునా? ఆకతెనశిక్ష నిచ్చిననాఁటినుండి యాకవినిఁ జూడ గుండె లదరుచున్నవి. ముఖము తప్పించుకొని తిరుగుచున్నాను.

మంత్రిప్రగడ — ఆవేళనుండి మతిచెడి వీధులవెంటఁ దిరుగుచున్నాఁడఁట! పాపము! పసువుచెడిన బ్రతుకఁ గలరా? అట్టి ప్రజ్ఞాశాలురు!

సుంకరి — (అలికిడివిని) అదిగో! ఆతనిదే కంఠధ్వని! పోవుదము రండు, తొలఁగిపోవుదము రండు! ఏకాల మెటువంటిదో! 'కవీశ్వరుని వాక్కు! కాలునిదృక్కు!' అన్నారు. రండు! రండు! (ఇద్దరు నిష్క్రమింతురు.)

(మాసినమోముతో, చిరిగినగుడ్డలతో దీనుఁడై శ్రీనాథుఁడు ప్రవేశించి)

"కవిరాజుకంఠంబుఁ గౌఁగిలించెనుగదా!
　　　　పురవీధి నెదురెండ పొగడదండ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా!
　　　　నగరివాకిటనుండు నల్లగుండు
ఆంధ్రనైషధక ర్తయంఘ్రియుగ్మంబునఁ
　　　　దగిలియుండెనుగదా! నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత,
　　　　వియ్యమొందెనుగదా! వెదురుగొడియ
కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము,
బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేటి మోసపోతి,
నెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు?"

అయ్యో! దౌర్భాగ్య దేవతా! ఈ బడుగు నేమిచూచి వరించితివే? సంపదలారా! జవసత్వములున్న దనుక తళుకుబెళుకులతో సరసము లాడి మెఱుపులవలె ఒక్కమ్మడిఁ గనుమొఱఁగి నేఁడు కనుపింపరేమే? ఓరాజలోకమా! నీరమ్యాలోకము నేఁడేలోకము చేరినది? ఆశ్రిత బృందమా! జలగలవలెఁ బీల్చిపిప్పిచేసి, సారహీనమని నేఁడు జారవిడచితివా? పద్యములు పద్యములని ప్రాణములు దీయు నా రసికనివహమునకు ఒక్కపర్యాయమే ప్రళయము వచ్చినదా? బంగరు పళ్లెరములఁ బరమాన్నములు గ్రోలినవానికిఁ బట్టెఁడు జొన్నన్నము సున్నయా! కస్తూరితావులఁ గుస్తరించిన నోటికి కాచుముక్క కఱవా! రత్నాంబరంబుల రాణమించిన మేను రంగుబొంత కెదురు చూడవలెనా! అందలంబుల నెక్కినవాని కాలి కట్టముక్క లరుదయ్యెఁగా! కాలవైపరీత్యము. అటు మట్టిబుద్ధులగు నీయొద్దైరాజుల గొడ్డుతనము; ఇటు అండయై యాదరించు నా యనువాఁడు లేకుండుట. ఏమిచేయుదును? నా దురదృష్టమునకై విలపింతును. ఓదుర్విధిరాక్షసుఁడా! నీ కుక్షిఁ గొల్లేటిమడుఁగా! రత్నంబులవంటి నారాజుల, పట్టుగొమ్మల నందఱను ఒక్కమ్మడిగ మ్రింగితివే! అయ్యో! ఇఁక నెట్లు జీవింతు?

'కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి,
రత్నాంబరంబు లేరాయఁ డిచ్చు?
కైలాసగిరిఁ బండె మైలారు విభుఁ డేఁగి,
దినవెచ్చ మేరాజు దీర్పఁగలఁడు!
రంభఁ గూడెఁ దెనుంగు రాయరాహుత్తుండు,
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు!
స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి మఱి! హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁ గలదు!
భాస్కరుఁడు మున్నె దేవుని పాలి కరిగెఁ
గలియుగంబున నిఁక నుండఁ గష్ట మకట!
దివిజ కవివరు గుండియల్ దిగ్గు రనఁగ,
నరుగుచున్నాఁడ నిదిగో! నే నమరపురికి'

ఔరా! దుష్కాలమున మరణమునకును మార్గము కనుపింపదే! (ఆలోచించి) ఔను! చక్కని యుపాయము. నాచేను ముంచి నన్ను చెట్లపాలుజేసిన ఆకడుపుచల్లనితల్లి కృష్ణవేణమ్మలోఁబడి కష్టములు గట్టెక్కెదను. (పోఁబోయి, ఆగి, ఆలకించి) ఆఁ! ఆత్మహత్య మహాపాపమా! భగవంతుని భజించిన బాధలు తొలఁగునా! ఎవరి దీధ్వని! నేను మున్ను వినినదే! (స్మృతి నభినయించి) ఆ! పోల్చితిని, పోల్చితిని. నిక్కముగా నీకంఠధ్వని మాపోతన్నది. ఆతఁడు సరిగ నీసమయమున కిచ్చటి కెట్లు వచ్చెను? వచ్చిన నాకుఁ గనుపింప కుండనేల? ఈ తర్కముల కంతులేదు గాని. మాబావను దలఁచుకొనిన, అదేమో! డెందమున కానందము గల్గుచున్నది. ఆతని శాంతమూర్తినిఁ జూడ వలయునని యుల్ల ముర్విళ్లూరు చున్నది. అయ్యో! ఆనాఁడాతని నెంతగ దూషించితిని! ఈస్థితిలో 'నిన్ను చూడ' నని ప్రతినఁ గూడఁ బట్టితినే! ఇప్పు డేముఖము బెట్టుకొని చూతును? (కొంచెమాగి) ఏమి! ఎందులకుఁ జూడఁగూడదు? ఆస్థితిలోఁ జూచుట లేదుకాదా! నేఁటిస్థితికిని నాఁటిస్థితికిని నెంతయో వ్యత్యాస మున్నది. అయినను ఆతఁ డట్లు పరిహాసము సేయుస్వభావముగలవాఁడుకాడు. చచ్చిన పామును చంపునా!

పోయెదను. ఈ రెడ్డిరాజుల పైకము సంపాదించి చెల్లింతునని గ్రామాధికారిని ఒప్పించి బమ్మెర కిప్పుడే పయనమయ్యెదను. అతఁడే దైన యుత్తమమార్గ మాదేశింపఁగలఁడు.

తెలు గ్రాలునమ. (నిష్క్రమించును)

చతుర్థరంగము – పొలమునమంచెమీఁదఁ బోతన కూరుచుండును.

పోతన — జగత్ప్రభూ! భాగవత మంతయు రచించియు నీ లీలలు సమగ్రముగఁ గొనియాడఁజాలనైతినే! అయినను నిది యేటి వెఱ్ఱి! బ్రహ్మాదులే నీ సర్వశక్తులఁ గీర్తింపలేనప్పుడు, వేదములే యవాఙ్మానస గోచరుఁడ వనినపుడు, ఈ యల్పునిమాట యడుగనేల! కాని సర్వజ్ఞా! నీకడ నేదియో మాయ యున్నది. కన్నుల కందక మనముల నాకర్షింతువే! అది యెట్లు? నీకును నాకును ఏదియో సంబంధ ముండితీర వలయును. కాదేని, నాడెంద మేల నిన్ను దలఁచినంతన యానందమున నోలలాడును? తెలిసినది! తెలిసినది! ఏదియో యొక్క సంబంధము కాదు. పెక్కు సంబంధము లున్నవి.

సాంద్రమేఘము నీవు చాతకమేను నీ
　　　　కరుణ వర్షింపవే కస్తి దీర!
చంద్రుండ వీవు నే చంద్రకాంతమను నీ
　　　　కరముల మలయించు గాసి దీర!
కుసుమంబు నీవు నే కొదమతుమ్మెదను నీ
　　　　పజ్జఁ జేర్పింపు పిపాసఁ దీర!
రసమానసం బీవు రాయంచ నేను నీ
　　　　యండఁ జేర్చుకొనుమ యలఁత దీర!
ప్రకృతిసిద్ధము మన కిట్టి బాంధవంబు
విడువఁజూడక యాలింపు విన్నపంబు
కమలజాండంబు ద్రిప్పెడి గారడీఁడ!
అన్యుల న్వేడ, నే తావకాంఘ్రి వీడ.

(కేలు మోడ్చి తన్మయుఁడై యుండును.)

పేరావధాన్లు— (ప్రక్కగా నిలుచుండి) అదిగో! మంచెమీఁదఁ గూర్చున్నాఁడు మంగళగిరి దేవుఁడల్లే! కవిత్వపీఠాలనుంచి కట్టెల మంచెమీఁదికి దింపేశా నా దెబ్బతే! (నవ్వి) ఎక్కడున్నా ఒకటే గొడవ! ఏమిటో మొక్కుతున్నాఁడు. ఏఁడుకొండల వెంకన్నకు పంట బాగా విరగపండించమని కాఁబోలు! ఓయీ! వెఱ్ఱిపోతన్నా! నీకు వెంకన్న తోడా? కానీ! ఇద్దఱు కలిసి కంకికి ఇద్దుం పండిద్దురు గానిలే! అదిగో! ఆమూలనుంచి ఆవులమందను పైరుమీఁదికి పడ దోలించా! (అటు చూచి) మల్లన్న చల్లాన్నం తినటానికి వెళ్ళాడు. ఇదే సమయం. ఇక్కడ దాఁగి చూస్తూ ఉంటా. (నిష్క్రమించును.)

పోతన— (పైరు మేయు ఆవులను జూచి) ఓహోహో! తలఁచినంతనే యా సర్వపాలుఁడు, గోపాలుఁడై నా ప్రోలకు వచ్చినట్లున్నాఁడే. అవిగో ముందుగ వచ్చుచున్నవి గోవులు. వెనుక గోపాలుఁడుండకుండునా? అయ్యారే! ఆ యావులు ముద్దులు మూటగట్టుచున్నవి. ఆ తెల్లని గంగడోలు, కుఱుచ కొమ్ములు, చేరెడేసి కన్నులు, కుండంత పొదుఁగు, కన్నులకఱవు దీఱుచున్నది. గోమాతలారా! రండు! రండు. అట్లు బెదరి బెదరి మోరలెత్తి చూచెదరేల? (ప్రక్కను జూచి) ఇదిగో! ఈ పాము కఱ్ఱను జూచి కాఁబోలు ఛీ! ఛీ!! ఇవి మా మల్లన్న పనులు. భయపడకుఁడు. దీని నిటే పారవేయుచున్నాను. ఆఁకలిదీర మేసిపొండు. (కఱ్ఱను బారవైచి, పొలమున వేఱొకవైపు చూచి) చిలుకలు! చిలుకలు! ఆహా! పచ్చడము పఱచినట్లు కనులపండువు సేయుచున్నవే? సర్వస్రష్టా! నీవు ఈ చిత్రికళను, ఏ కళాశాలలో నభ్యసించితివి? ఎఱ్ఱని ముక్కుసొంపు, పచ్చని ఱెక్కలతీరు; ఏమి యానందము. (తన ప్రక్కనజూచి) ఈవడి సెల యెందులకో? ఉరిఁబెట్టుకొనుటకు. కాదు ఈ పిట్టల నోట మట్టి గొట్టుటకు. ఔరా! నరుఁడా! నీవెంతటి స్వలాభపరుఁడవురా! ఎంత పఱుకును, మా కాయుష్యము, మా కారోగ్యమే కదా। దయామయుండగు భగవంతుఁడు సర్వభూతతృప్తికై ప్రసాదించిన భాండారమును, నీ తాత

మల్లెవలె, మఱి వేనికిని బాలుబెట్టక కాలఁదన్ని నీవాఁతఁ బెట్టుకొనెదవే! ఇది తగవా!

పశువులు స్వేచ్ఛమై బ్రతుకఁగా నేపైన
పైరుపచ్చలఁ బెంచెఁ బ్రాజ్ఞుఁ డతఁడు
దిక్కులేకయె గాలిఁ దిరుగు పక్షులకునై
సస్యమంజరు లిచ్చె సరసుఁ డతఁడు
అల్పజీవుల కింతయాహార మౌనని
పువ్వులఁ దేనియఁ బోసె నతఁడు
నిఖిలప్రాణులు మేను నిలుపఁగా ధారుణి
వివిధౌషధుల నిచ్చె విజ్ఞుఁ డతఁడు
నీదుసొమ్మైనయట్టులు వాదులాడి
సత్రమున ఊళ్లు గొట్టెదో శత్రురూప!
నోరుగలవాఁడ వౌట నా నోరులేని
జీవులను దవ్వులకుఁ దోలె దీవు చెనఁటి!

పేరా— ఎహెహె! పచ్చనిపైరు పశువులు మేసిపోతూ ఉంటే పద్యాలు పాడుచున్నాఁ డీపరమఛాందసుఁడు. పాపము! ఆ మల్లన్న ఱెక్కల కష్టం మట్టిపాలైంది. అయినా మఱి చెడ్డ పోతన్నని మంచెక్కిస్తే ఏమవుతుంది? ఈనఁగాచి నక్కలపాలు చేసినట్టు సిద్ధాన్న మధ్వాన్న మయిపోయింది. ఈ వేళ ఇతగాణ్ణి చూస్తే ఏమిటో జాలి అనిపిస్తోంది. కాకపోతే నాతో ఎదురా! నేను తలుచుకుంటే కాని దేమిటి? నాజన్మలో అపజయం ఎఱుగను! ఈ పోతన్న నీగతికి తెచ్చిం దెవరు? ఈ పేరావధాని కాదూ! (అటుజూచి) ఓహో! మల్లన్న వచ్చే వేళ అయినట్టుంది. ఇఁక మాట దక్కదు. నింపాదిగా ఈ మూలనుంచి జారతా! (వెళ్ళిపోవును.)

మల్లన్న— (పఱుగుపఱుగున వచ్చి) అదిగో! నాయనగారు నారాయణస్మరణఁ జేయుచు మంచెమీఁదఁ గూరుచున్నారు. (చేను చూచి) పశువులు చేను పాడుచేసిపోయినట్లున్నవి! పోనిమ్మా! పోయిన

దానికిఁ జింతింపరాదని పలుమారులు సెలవిచ్చియున్నారు నాయన గారు. దరిఁజేరి రాజాగమనమును మనవి చేసెదను.

పోతన—(మల్లన్నను జూచి) వచ్చితివా! రమ్మా. ఇటు కూరుచుండుము.

మల్లన్న—చిత్తము! కూరుచుండుటకుఁ గాదు. రాచకొండనుండి రాజుగారు గ్రామములోనికి దయచేసినారు. తమ్ముఁదోడ్కొనిరమ్మని సెలవైనది.

పోతన— (ఉలికిపడి) ఏమీ! రాచకొండరాజా! అయ్యో! ఈ రాజగ్రహములు నను ప్రాణములతో వదలునట్లులేదే! మూడేండ్లు సాముఁ జేసి మూలనున్న ముసలమ్మపైఁబడినట్లు ఏమికొల్లఁగొట్టుటకు నాపై దాడి? కండకొవ్వెక్కిన కడిఁదిజోదులతోఁ బోరరాదా! కాదు! కాదు! వీనికన్ను నానిధానముపైఁ బడినది. (కోపముతో) ఓరా! అనద ననుకొంటివా! నాపాలి చక్రిధరుఁడున్నాఁడు. జాగ్రత్త! ఆ సుదర్శనజ్వాలామాలికలలో శలభమై పోదువు సుమా! జాగ్రత్త! నీవు వేయి పుటములు వేసినను నాభాగవతమును ఆ రామభద్రునకుఁదక్క నీకుఁ గృతినీయను. పొమ్మా! (అని కండ్లెఱ్ఱజేసి చూచుచుండును.)

మల్లన్న—(భీతుఁడై జూచుచు) తండ్రీ! తమరు వేఱుగ భావించినట్లున్నారు. రాజుగారు బలిమిని గ్రంథము కృతినొంద రాలేదఁట. పశ్చాత్తప్తహృదయముతోఁ దమదర్శనమునకై వచ్చిరఁట. ఇంతియేగాక, మీఁదుమిక్కిలి శ్రీరామభద్రునకే మీచే మహావైభవముతోఁ గృతి సమర్పింపఁ జేసి యుత్సవము చేయుదురఁట.

పోతన— (ఆశ్చర్యముతో) ఆఁ! ఏమి! వజ్రములు వెన్నముద్దలగుట సంభవమా! గండుపులులు గన్నిటినిఁగూడ రాల్చునా! రాజులకుఁ బశ్చాత్తాపమా! (తలయూఁచి) కావచ్చును. సర్వేశ్వరుని సంకల్పములగోచరములు. అతఁడు తలపెట్టిన కాని దేది? చండకిరణుఁడు

శీతకిరణుఁడును గావచ్చును. [సంతసముతో] శ్రీరామచంద్రునకుఁ గృతిసమర్పణోత్సవమా! ఆహా! ఆనందము! పరమానందము!

మల్లన్న— సింగభూపాలుఁడు మనకై వేచియుండును. ఇంటికిఁ బోవుదమా?

పోతన—(సంతసముతో) పోవుదము. పోవుదము. శ్రీరామచంద్రునకుఁ గృతిసమర్పణోత్సవము. మా శ్రీరామచంద్రునకుఁ గృతిసమర్పణోత్సవము. మహావైభవముతో! రాజోపచారములతో! ఇంకేమి కావలయును? (ఇద్దఱు నిష్క్రమింతురు.)

పంచమరంగము – దీనుఁడై పేరావధాని ప్రవేశించును.

పేరా— పడిచి కూర్చుండలేక పులితోఁ జెలగాట మాడాను! ఔరా! ఈ పోతన్న ఎంతటివాఁడూ. కాకపోతే ప్రభువులే వచ్చి పాదాలపైఁ బడతారూ? 'ఊరంతా ఒక దారి. ఉలిపికట్టె ఒక దారి' అన్నట్టు ఆబాలగోపాలం అతఁడంటే అవతారమూర్తివలె ఆదరిస్తూ ఉంటే నేనెందుకు ఎదురు దిరగాలి? అయినా నిజం విచారిస్తే అతఁడు నాకేమి అపకారం చేశాడు? తిట్టాఁడా! తిమ్మాఁడా! గౌరవం తెచ్చుకోవద్దన్నాఁడా! 'తనకు లేదని ఏడిస్తే ఒక కన్ను, ఎదుటివాఁడికి ఉన్నదని ఏడిస్తే రెండో కన్ను పోయిన' దన్నట్టు యీతని మీఁద పరవళ్లు త్రొక్కటం మొదలుపెట్టిన తరువాత ముందున్న ఆ కొంచెం పలుకు ముక్కచెక్కలైపోయిందిగదా! ఎక్కడికి వెడితే అక్కడే పొద్దెదురుగదా! ఈతని చేలో ఏమని మేపానో తప్పాల నింపే తరిపిగొడ్డు తన్నేసింది గదా! చేసినవాఁడికి చేసినంత మహాదేవా! 'నవ్వుతూ చేసి ఏడుస్తూ అనుభవించాలి' కాని! ఇఁక మాట దక్కదు. రాజు పోతన్న చేతిలో కీలుబొమ్మ. ఏవేళ ఎటువంటిదో! వస్తుతః పోతన్న మంచివాఁడు. నెమ్మదిగా ఆశ్రయిస్తా! ఆశ్రయింపు మంత్రం సిద్ధిఁబొందిన నాకు దేవతలే వశులౌతారుగు [illegible] చెప్పాలా! (అటు చూచి) ఓహో! అరుగో! కూర్చున్న [illegible] ఎవరు? (పరికించి జూచి) ఈయనా! శ్రీనాథుఁడుగారు కామా! అబ్బ!

ఆనవాలు పట్టలేనంత మారిపోయినాఁడే! 'అధికారాంతమునందుఁ జూడవలదా ఆ యయ్య సౌభాగ్యముల్' అన్నట్లు పని యెత్తుపడి నట్టుంది. ఏమో! నాకుమల్లెనే ఈయనికి గ్రహాలు వక్రించినవేమో! అదిగో! పోతన్న కిరువైపులఁ గూర్చొని రాజుగారు ఈయన ఏమిటో మాట్లాడుతున్నారు. పోయి దూరంగా కూర్చుంటా!

(నిష్క్రమించును.)

వష్ఠరంగము – పోతనగృహము.

పోతన శ్రీనాథసింగభూపాలురతోఁ బ్రసంగించుచుండును.

పోతన—సత్యము! అం దాశ్చర్య మేమియు లేదు. నీవు మహా పండితుఁడవు. కవిసార్వభౌముఁడవు. కాని, నీ ప్రతిభలో నెక్కుడు భాగము కేవల మైహికమునకై వమ్మైనది. ఈ నరులను నమ్మినట్లు నారాయణుని నమ్మియుండిన నీ కీస్థితి వచ్చియుండదు. చూడు!

'అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి, వందులోన నిం
చించుకగాని విష్ణుకథ లేర్పడఁ జెప్పవు! ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే? గుణ విశేషము లెన్నినగాక, నీకు నీ
కొంచెము వచ్చుటెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా!'

శ్రీనా—బావా! నిజము పల్కితివి. చేసిన యపచారమునకు శిక్ష యనుభవించుచునే యున్నాను. ఒక్క సత్కావ్యము రచించి శ్రీహరికి సమర్పింపనైతిని గదా!

సింగ—(పోతనఁ జూచి) సత్కావ్యములన జ్ఞప్తికి వచ్చినది! సత్కావ్యాసత్కావ్యముల నిర్వచనము స్వామీ! తమ నోటినుండి విన వలతును.

పోతన—మంచిది. నాయనా! కావ్యలక్షణము పలువురు పలు విధంబులుగ నిర్వచించిరిగదా! వానిలో నామదికి సమ్మతమైన నిర్వచన మిది.

"హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజితమైన మానససరస్స్ఫూర్తిన్ వెలుం గొందు, శ్రీ

హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు, శ్రీ
కరమై యుండ దయోగ్యదుర్మలినవస్త్రాకీర్ణగాత్రాకృతిన్."

శ్రీనా— ఇయ్యది నిష్కృష్టమైన లక్షణము. సదభిమతము. సందేహము లేదు.

సింగ— సహజపాండిత్యప్రభావసంపన్నులు నిర్వచింపఁ, గవిసార్వభౌము లనుమతింప సందేహమునకుఁ దా వేది! నేఁడు సత్కావ్యలక్షణ మెఱిఁగి ధన్యుఁడ నైతిని. అట్టి సత్కావ్యఫలమును ఈ పోతన కల్పకాఖ ప్రసాదించెనుగదా! దానిని శ్రీరామభద్రునకు సమర్పించి ధన్యుల మయ్యెదమా! ఆజ్ఞ యైనచో సర్వసన్నాహములు సిద్ధముగ మన్నవి.

శ్రీనా— అంతకంటెఁ గావలయున దేమున్నది! (పోతనఁ జూచి) బావగారూ, ఇన్ని యిడుములకుఁ ఫల మొగ్గినది దీనికే! వారి రొట్టె నేతిలోఁ బడినది. శుభము! శీఘ్రము!

పోతన— ఆ పరంధాముఁడే మీ హృదయములఁ బ్రవేశించి యీ యుత్సవమును మహావైభవముతోఁ జరిపించుకొనుచున్నాఁడూ లేకున్న నిస్స్వుఁడ నగు నాచే నిట్టి పను లౌనా?

సింగ— తమరు నిస్స్వులా? నిధానముల కేలికలు! ధనికులు మీ పాదదాసులు!

శ్రీనా—సత్యము. ముమ్మాటికిని సత్యము. ఇఁక ఆలస్య మెందులకు? కృతిసమర్పణోత్సవమున కాయత్తులు గండు.

పోతన— పెద్దల యాదేశము! కానిండు!

సింగభూ— ధన్యుఁడను. ఓరీ! ఎవఁడురా అక్కడ?

సేవకుఁడు— (చేతులు జోడించి) ప్రభువువారి యాజ్ఞ!

సింగ—గ్రామ మంతయు నలంకరించి కృతిసమర్పణోత్సవమునకు సర్వము శీఘ్రముగ సిద్ధము చేయింపు మని మంత్రితోఁ జెప్పుము.

సేవ— చిత్తము. [నమస్కరించి పోవును.]

శ్రీనా — [నవ్వుచు] ఇఁక బావగారు అందల మెక్కవలెను. అల వాటు లేని యాూపాసన! జాగ్రత్త సుమా! కుచ్చులుపట్టుకొనికదలక కూరుచుండుఁడు.

సింగ — ఔను. కృతిక ర్తలఁ గృతితోఁబాటు బంగరుపల్లకిపై నూ రేగించుచు శ్రీరామాలయమునకు సుముహూర్తసమయమునకుఁ జేరు దము లెండు.

పోతన — అహంకారసూచకములగు నందలము లెందులకు లెండు! కల్యాణస్వరూపుఁడగు కమలాక్షునకుఁ గృతికన్య నిచ్చి తరించుసుది నము నేటికి వచ్చినది. అంతియే చాలును! సర్వము నతని కరుణ.

సేవ — [చేతులు జోడించి] సర్వముసిద్ధమైనదఁట. తమకై యెదురు చూచుచున్నారు. (తొలఁగును.)

సింగ — ఇఁక ఆలస్యమొందులకు? బయలు దేరుదము. దయ చేయుఁడు. [అందరు నిష్క్రమింతురు.]

సప్తమరంగము—రామాలయము

భాగవతము భగవంతునెదుటఁ బెట్టి, అందరు నుచితప్రదేశములఁ గూరుచుండి యుందురు.

శ్రీనా—వసిష్ఠులు వైదికకృత్యము నెరవేర్చిరి. ఇఁక కృతికర్తలు కృత్యాదిపద్యమును జదివి షష్ఠ్యంతములతోఁ గృతిని శ్రీరామభద్రునకు సమర్పింపుఁడు.

పోతన—పెద్దల యాజ్ఞ! శ్రీరస్తు. శుభమస్తు. అవిఘ్నమస్తు.

'శ్రీకైవల్యపదంబు చేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు, భక్తపాలనకళాసంరంభకున్, దానవో
ద్రేకస్తంభకుఁ, గేళిలోలవిలసద్దృగ్జాలసంభూతనా
నాకంజాతభవాండకుంభకు మహానందాంగనాడింభకున్'

ఇట్లారంభించి నే నిమిత్తమాత్రుండనై రచించినఆంధ్రభాగవతమను కృతిని,

'న్యాయికి, భూసురేంద్రమృతనందనదాయికి, జానకీమనః
స్థాయికి, భూతసమ్మతవిధాయికి, సాధుజనానురాగసం
ధాయికిఁ, బీతవస్త్రపరిధాయికిఁ, బద్మభవాండభాండని
ర్మాయికి, భక్తలోకపృథుమందిరయాయికి శేషశాయికిన్.'

భక్తిమై సమర్పించుచున్నాను. ఓసకలగుణసముద్రా! రామభద్రా!

ధరణిదుహితృరంతా! ధర్మమార్గానుగంతా!
నిరుపమనయకాంతా! నిర్జరారాతిహంతా!
గురుబుధసుఖకర్తా! కుంభినీచక్రభర్తా!
సురభయపరిహర్తా! సూరిచేతోవిహర్తా!

దీనిని స్వీకరించి నీపాదభక్తు ననుగ్రహింపుము. [ సమర్పించును. అందరు కరతాళధ్వనులు చేయుదురు. వాద్యములు మ్రోఁగును.]

శ్రీనా— సర్వము జయప్రదముగ జరిగినది. 'హాలికుఁడా!' యని యెన్నఁడో నే ననిన పదము సన్వర్థముఁ జేసి యాంధ్రసారస్వత క్షేత్రమును అరక దున్ని యత్యంతమధురమగు భాగవతఫలము నాంధ్రుల కందించిన మా పోతన యథార్థముగ హాలికుఁడు. సంకల్ప సిద్ధికై సార్వభౌముని సైతము సరకుసేయక అష్టకష్టము లందిన యాదర్శజీవి యీ హాలికుఁడు భాగవతులలోఁ బ్రథమగణ్యుఁడు. కవులలోఁ గనిష్ఠికాధిష్ఠితుఁడు. నరేశ్వరులనే యేదుగడ లని నమ్మి నష్టపడిన మాబోంట్లకు గుణోపదేశము చేసిన గురూత్తముఁడు. ఈ కవిచంద్రుని కీర్తిచంద్రిక ఆంధ్రవాఙ్మయసౌధమునకుఁ జంద్రశాలికయై యాచంద్రతారము తేజరిల్లుఁగాక! ఈతని పవిత్రజీవిత మఖిలాంధ్రకవులకు నొరవడి వ్రాలగుఁగాక!

పోతన— శ్రీనాథుల సౌహార్ద్ర మట్లనిపించుచున్నది. దాని కేమి గాని, నేడు నాహృదయమునుండి యేదియో భారము దింపివైచినట్లున్నది! శాంతి చేకూరినది! ఆనంద మావహిల్లినది!

శ్రీనా—సింగభూపాలా! పోతరాజునుబోలు మహాకవీశునిఁ, భక్తాగ్రగణ్యుని, వజ్రసంకల్పుని గన్న యాంధ్రావనికి ఏలికవై ధన్యుఁడవైతివి. ఇఁక కర్తవ్యమును జూడుము.

సింగ—చిత్తము. కవిసార్వభౌములు ఆనతిచ్చిన దెంతయు యథార్థము. సహజకవితాసంపన్నులును, శాంతిశమదమాదిసద్గుణవిరాజితులునగు పోతనామాత్యుల గురూత్తములనుగాఁ బడయఁగల్గినందుల కెంతయు నానంద మగుచున్నది. నాజన్మము తరించినది. (రత్నహారములు దీసికొని పోతన జూచి) మహాత్మా! అఖండవిజ్ఞానధనసంపన్నులగు తమ కియ్యది చంద్రునకు నూలుపోఁగు వంటిది. దీనిని స్వీకరించి నన్ననుగ్రహింప వేఁడెద. నాయజ్ఞానమునఁ గలిగిన యపరాధముల మన్నించి యాశీర్వదింపఁ బ్రార్థించుచున్నాఁడను. (మెడలో వేయఁబోవును.)

పోతన—(వారించి) నాయనా! వలదు! వలదు! ఒకింత వినుము. రత్నహారములకు రామభద్రుఁ డర్హుఁడు. వానికి సమర్పింపుము. (విగ్రహమును జూపును.)

సింగ—చిత్తము. ఆజ్ఞ! (అర్చకుని హస్తమున సమర్పించును.) ఇఁక సభాపూజఁ జేయ నాజ్ఞ వేఁడెద.

పోతన—అవశ్యము. అరుగో! సర్వపూజ్యులును, కవిసార్వభౌములును నగువిద్యాసనాథులు శ్రీనాథులు. వారు ప్రథమసమ్మాన్యులు.

సింగన—చిత్తము. (రత్నహారము దీసి) కవిసార్వభౌములు దీనిఁ బ్రీతిగ్రహించి నన్ననుగ్రహింప వేఁడెద.

శ్రీనా— బావగారి యాజ్ఞ. రత్నహారముతో నొదలఁ దాల్పక తప్పదు. నవ్వుచు స్వీకరించును.)

సింగ—(పెద్దలను మఱికొందఱఁ బూజించును.)

శ్రీనా— సర్వము శ్వశ్శ్రేయస మైనది. ఇంకేమి కావలయును?

పోతన—మంగళాలయుని కరుణఁ బూర్ణకాములమైతిమి. అయినను భరతవాక్య మిట్లగుఁగాక!

ప్రకృతి రంజిలఁ జేయఁ బ్రాణంబు లొడ్డెడు
పార్థివుఁ డీధాత్రి వఱలుఁగాత!
జాతిప్రతిష్ఠకై సర్వస్వ మర్పించు
ప్రకృతి యెల్లయెడలఁ బ్రబలుగాత!
ధర్మరక్షణముగాఁ దనువు బలియొసంగు
ధన్యాత్ముఁ డీభూమిఁ దనరుగాత!
జ్ఞానసమృద్ధికై సత్కృతుల్ రచియించు
కవి లోకమున వాసి గాంచుగాత!

ప్రేమసూత్రనిబద్ధమై విశ్వ మెల్ల
మేలు గాంచుత! శాశ్వతశ్రీలు వడసి
శాంతి చేకూరు గావుత! సత్యరోచి
వెన్నెలలు గాయుఁగావుత! వేఁడు కలర.

అందఱు— తథాఽస్తు! తథాఽస్తు! తథాఽస్తు!

మంగళము.

పంచమాంకము సంపూర్ణము.






ఓరియంటల్ ముద్రాక్షరశాల, [illegible] మార్కెట్ వీధి, సికింద్రాబాద్.

శ్రీనా — సింగభూపాలా ! పోతరాజును బోలు మహాకవీశుని, భక్తాగ్రగణ్యుని, వజ్రసంకల్పుని గన్న యాంధ్రావనికి పలికపై ధన్యుఁడవైతివి. ఇఁక కర్తవ్యమును జూడుము.

సింగ — చిత్తము. కవిసార్వభౌములు ఆనతిచ్చిన దెంతయు యథార్థము. సహజకవితాసంపన్నులును, శాంతిశమదమాదిసద్గుణవిరాజితులునగు పోతనామాత్యుల గురూత్తములనుగాఁ బడయఁగల్గినందుల కెంతయు నానంద మగుచున్నది. నాజన్మము తరించినది. (రత్నహారములు దీసికొని పోతన జూచి) మహాత్మా! అఖండవిజ్ఞానధనసంపన్నులగు తమ కియ్యది చంద్రునకు నూలుపోఁగు వంటిది. దీనిని స్వీకరించి నన్ననుగ్రహింప వేడెద. నాయజ్ఞానమునఁ గలిగిన యపరాధములు మన్నించి యాశీర్వదింపఁ బ్రార్థించుచున్నాఁడను. (మెడలో వేయఁ బోవును.)

పోతన — (వారించి) నాయనా! వలదు! వలదు! ఒకింత వినుము. రత్నహారములకు రామభద్రుఁ డర్హుఁడు. వానికి సమర్పింపుము. (విగ్రహమును జూపును.)

సింగ — చిత్తము. ఆజ్ఞ! (అర్చకుని హస్తమున సమర్పించును.) ఇఁక సభాపూజఁ జేయ నాజ్ఞ వేడెద.

పోతన — అవశ్యము. అదిగో! సర్వపూజ్యులును, కవిసార్వభౌములును నగువిద్యాసనాథులు శ్రీనాథులు. వారు ప్రథమసమ్మాన్యులు.

సింగన — చిత్తము. (రత్నహారము దీసి) కవిసార్వభౌములు దీనిఁ బ్రీతిగ్రహించి నన్ననుగ్రహింప వేడెద.

శ్రీనా — బావగారి యాజ్ఞ. రత్నహారముతో నొదలఁ దాల్పక తప్పదు. నవ్వుచు స్వీకరించును.)

సింగ — (పెద్దలను మఱికొందఱఁ బూజించును.)

శ్రీనా — సర్వము శ్వశ్రేయస మైనది. ఇంకేమి కావలయును ?